ప్రకాశకులు
ఆంధ్రప్రదేశ
వీరశైవ ధర్మగ్రంథమాల,
అమృత ఆర్కేడు, (ప్రభాత్ టాకీస్) కాచిగూడ,
హైదరాబాదు - 27.

ముద్రణము 10-5-1998

ప్రతులు - 500

మూల్యము : Rs. 12-00



ప్రతులకు ప్రాప్తిస్థానము
**వే.పం. పెద్దమఠము రాచవీరదేవర "తీర్థ" M.O.L.**
ఇం.నెం. 3-3-139, నెహ్రూ హైస్కూలు వద్ద, కాచిగూడ,
హైదరాబాదు - 500 027. (ఆం.ప్ర).



# NAGARJUNA JUNIOR COLLEGE

**(CO EDUCATION)**

*(Sponsored by Nagarjuna Educational Society, Sangareddy)*

Affiliated to Board of Intermediate Education

Vide R.C. No. 104/E3-2/92-93, Date 15-6-92

Beside Natraj Theatre, Shantinagar, SANGAREDDY

Ref :

Date : 12/12/1994.

## WHOM SO IT MAY CONCERNED

This is to certify that **Sri. PANDITA PEDDA MATHAM RACHAVEERA DEVARA** M.O.L. Teertha **S/o. P.M. VEERAIAH** has worked as a Junior Lecturer in Sanskrit subject during the Academic Year 1994-95.

He is industrious and hard-working.

Sd/-
PRINCIPAL
Nagarjuna Jr. College,
Sangareddy.

# విషయానుక్రమణిక

## బసవ సూక్తి సుధా

23. కులమునడుగవలదు
24. అహింసావ్రతమును బాటించాలి
25. కలిసి భుజించాలి
26. ఇహ- పరములు
27. సకలప్రాణులనుదయతో- జూడాలి
28. అందరితోగల్సి జీవించాలి
29. దేవుడే గతి - మతి
30. పురాతనులవాక్యములే మార్గదర్శకములు
31. ప్రభువు (దేవుడు) ప్రసన్నుడైన
32. పట్టుండవలెను
33. మార్గమునశకునములు
34. స్థితప్రజ్ఞుడు
35. శృంగారము
36. సత్యమునాచరించాలి
37. అంధవిశ్వాసము వలదు
38. స్వతః పూజించవలెను
39. సంపాదననుదాచవలదు
40. ఉత్తమగుణములున్నవారిని దేవుడిగా భావించవలెను
41. సత్పాత్రమునకు దానముజేయవలెను
42. దాసుడననే భావముండాలి
43. డంభాచారములదు
44. పెద్దలతో సరసరసమాడదగదు
45. వ్యక్తి ప్రతిష్ఠవలదు
46. సర్వాంతర్యామి పరమాత్ముడు
47. దేవుడికి సర్వము నర్పించవలెను

'ఇతిశమ్'

॥ఓం॥

॥శ్రీగురు బసవలిగాయనమః

# శ్రీ కళ్యాణ బసవేశ్వరుని పరిచయము

శ్లో॥ మునియాచనయా శివాజ్ఞయా । శివభక్తుద్ధరణార్థమాగతం ।
వృషరాజపరావతారతా । మహితంశ్రీ బసవేశ్వరంభజె ॥

శ్రీ పాలకురికి సోమనాథ కవి కృత బసవోదాహరణము ద్విపద పురాణము, శ్రీ పిడుపర్తి సోమనాథ కవి విరచిత పద్యకావ్యము, కన్నడమున శ్రీ భీమ కవివర కృత బసవ పురాణము. "బసవ రాజదేవర రగళె" మరియు సంస్కృతమున వ్యాసోక్త బసవ పురాణాదులను సమగ్రముగ బఠించి బరిశీలించిన యెడల భూలోకమున వీరశైవ ధర్మము క్షీణ గతిని బెందు చున్న సమయమున

॥యదాయదాహి ధర్మస్య - హానిర్భవతిభూతలె ।

తదాతదావతారో 2 యం - గణేశానంమహీతలె॥ అనువీరశైవుల కుమూలాధరమైన సిద్ధాంత శిఖామణియను ప్రమాణ గ్రంథము ప్రకారము సాక్షాత్‌గా కైలాసమున ప్రమధగణాదులతో బడ్డోలగమున రత్న సింహాసనముపై విరాజమానమైయున్న పార్వతీ పరమేశ్వరులకు త్రిలోక సంచారియైన నారదమునీశ్వరుడు ప్రణమిల్లి భూలోకమునందల్లి క్షీణించియున్న వీరశైవధర్మము యొక్క స్థితి గతులను గురించి వివరింపగానదివిన్న శంకరుడు అందుకు దగిన ధర్మమూర్తి యైన నందీశ్వరుని బిలిచి నీవుమర్త్య లోకము నందవతవరించి క్షీణదశనొందిన వీర శైవ ధర్మమును బునరుద్ధరించు మనియాజ్ఞాపించి, యిందుకు నీవే సమర్థుడివని సెలవిచ్చెను. ఇట్లు శివాజ్ఞా బద్ధుడైన నందీశ్వరుడే భూలోకమున బసవేశ్వరుడై కర్నాటకములో విజాపూర్ జిల్లా బాగెవాడి గ్రామమున సుప్రసిద్ధ శైవకుటుంబము శ్రీమాది రాజు మాదలాంబికలగర్భ శుక్తిక యందు జాతి మౌక్తికములా జన్మించాడు. బసవన్న 8 వ సం॥ మున ఆ శిశువునకు తల్లిదండ్రులు ఉపనయన సంస్కారమును జేయించుటకై ఉపక్రమింపగా అందుకు కేవలము కర్మకాండమునే బోధించె ఆ సంస్కారము నాకు వలదని తిరస్కరించి నేను జన్మించగానె

కప్పడి సంగమేశ్వరుడు విచ్చేసి నాకు శివదీక్ష నొసగి యున్నాడని తల్లి దండ్రులతో వాదించి అతి పిన్నప్రాయముననే కప్పడి సంగమేశ్వర పుణ్య క్షేత్రమునకు వచ్చి అక్కడ శ్రీజాతవేదమునివరేణ్యుని ద్వారా వేదాగమోపనిషత్తుల విజ్ఞానము నభ్యసించెను. ఈ బాలుని బుద్ధి పాటవమునకు, విజ్ఞానమునకు, బ్రసన్నుడైన కళ్యాణ పురమునేలు రాజు వీరబిజ్జళుని మంత్రి శ్రీ బలిదేవమంత్రి తన కూతురైన నీలాంబిక నొసగి వివాహ మొర్చెను. బిజ్జళ రాజుగూడ సంతసించినవాడై రాచమర్యాదలతో తన కళ్యాణ పట్టణమునకు రాజభవనమునకు రప్పించుకొని క్రోశాగారమునకు సచివాగ్రేసరునిగా నియమించెను. ఐనను పదవీ అహంకారమును విడనాడుటచేత "భక్తి భండారి" బసవన్న అనుబిరుదమునకర్హుడయ్యెను. పరిపూర్ణ విజ్ఞానవేత్తలైన వారికి అహంకారముండదు సరిగదా! అందుకే

॥ విద్యాదదాతి వినయం వినయద్యాతి పాత్రతాం
పాత్రత్వాద్ధనమాప్నోతి ధనాద్ధర్మ తతఃసుఖం॥

అన్నారు ఆర్యులు. అదే విధముగా బసవేశ్వరులవారుగూడ రాజకీయధురంధరుడు (కోవిదుడు) మరియు ధార్మిక ప్రవక్త యగుటవలన చారి త్రికులుట్టంకించిన సమయము మేరకు ఇతడు 12వ శతాబ్దములో నుండి అప్పడు క్షీణదశలో నున్న వీరశైవ ధర్మమునుద్ధరించియున్నాడు అనిరి. వీరశైవ ధర్మమునే గాక సమస్త మానవకులమునే ఉద్ధరించెను. అస్ప్ప తనుదొలగించెను కుల మత వర్ణ విభేదములను సమసింపజేసెను, స్త్రీ - పురుష సమానతను గల్పించెను వృత్తులను బ్రోత్సహించెను. హెచ్చు తగ్గులను తుడిచిపెట్టెను. నిమ్న జాతి వారి ఆచార విచారములకు బ్రాధాన్యత నొసగివారికి సమాజములో ఉన్నత స్థానమును గల్పించెను, ఏకేశ్వరోపాసనకు బునాది వేసెను, వర్ణాంతర వివాహమును చేపట్టెను. వేయెలవారి సూక్తులను బఠించినచోపఠితులకు అతని విశాల హృదయము బోధపడును.

ఇట్లు
గ్రంథకర్త



లింగైక్యము కీర్తి శేషులు చి. పి.ఎం. ప్రభులింగ దేవర
ఎం. ఏ.ఎంఫిల్. పి.హెచ్.డి. (ఎస్.ఐ.)



ఆంధ్రప్రదేశ్ మాజిముఖ్యమంత్రి కీ.శే. శ్రీ N.T. రామారావు గారు
గురుపూజ సందర్భమున పం. పెద్దమఠము శ్రీరాచవీరదేవర గారు
వ్రాసిముద్రించిన గ్రంథములను స్వీకరించి వారిని సన్మానించిన చిత్రము



ఇందులో ఆకాశవాణి అసిస్టెంటు డైరెక్టరు శ్రీ కొ(ట్రామల్లికార్జున శర్మ గారు
గూడా కూర్చున్న వారిలో ఉన్నారు. 2-11-97



తేది ౨-౧౧-౨౭ న, శ్రీవీరణ్ణగుట్ట పై జరిగిన వీరశైవ ధర్మ
సంస్థాపకులైన జగద్గురు శ్రీశ్రీశ్రీ రేణుకా చార్యులవారి
జయంత్యుత్సవ సందర్భమున ప్రసంగిస్తున్న
పం. శ్రీ రాచవీరదేవర గారు. M.O.L.



కాశినుండి వేంచేసిన పూజ్య బాళాపుర
శ్రీమల్లికార్జున మహస్వాముల వారు వేం. పం. పెద్దమఠము,
శ్రీ రాచవీరదేవర గారిని సన్మానిస్తున్న చిత్రము.




జగద్గురు శ్రీ రేణుకాచార్యుల వారి జయంత్యుత్సవమును తేది ౨-౧౧-౧౯౯౭ న,
ఆం. ప్ర. వీరమాహేశ్వర (జంగమ) మహసభ 'హై.' మరియు వీరశైవ ఆగమ పరిషత్తు,
హైదరాబాదు వారి పక్షమున వీరణ్ణగుట్టపై నిర్వహించిన దృశ్యము.



ఇందులో, హై. ఆకాశవాణి అసిస్టెంటు డైరెక్టరు శ్రీ కొట్ర మల్లికార్జున శర్మ గారు మరియు వీరశైవ మహాసభాధ్యక్షులు శ్రీ పత్తి జమహారుద్రప్ప గారు కార్యదర్శి శ్రీ యం. జగదీశ్వర్ గారున్నారు.

డా. మఠం లింగయ్య స్వామి M.A., Ph.D.
జానంపేట (ఫరుఖ్‌నగర్), షాద్‌నగర్ బృహన్మఠాధ్యక్షులు &
ప్రభుత్వపాలనోపన్యాసకులు, ఉస్మానియా విశ్వవిద్యాలయం

# మున్నుడి

వచన సాహిత్యానికి కర్ణాటకలో ఉపనిషత్‌ల సమాన గౌరవము లభించినది. పండిత పామర భేదము లేకుండ జనసామాన్యమంతయు వచనముల విశిష్టతను శ్లాంఘించెదరు. కన్నడ సాహిత్య రంగములో వినూత్న పోకడలను సృష్టించి, సాహిత్యమును ప్రజలకు అందుబాటులో ఉండేలా చేసిన ఘనత వచనకారులకు దక్కుతుంది. కన్నడ సాహిత్య చరిత్రలోని క్రీ.శ. 11 వ శతాబ్ధి నుండి 15 వ శతాబ్ధి వరకు గల కాలాన్ని సాహిత్య వేత్తలు ''వచన యుగం'' గా గుర్తించడం గమనార్హమైన విషయము. వచన వాఙ్మయమును మకుటంగా నిలిచి నిరుపమాన తేజోపుంజముగా ప్రకాశించే ''బసవ వచనాలు'' జగత్ ప్రఖ్యాతినార్జించినవి.

వచన మంటే అవయవర్థాన్ని బట్టి ''మాట'' అను అర్థము కలదు. కొందరు విద్వాంసుల ప్రకారము వాఙ్మయ పరంగా వచన మనగా ఛందో నియతిలేని రచనము. వచనములను నిశిత పరిశీలనకు గురిగా మాత్రాగణ బద్ధములైన భావగీతాలు గా

గోచరిస్తాయి పాల్కురికి సోమనాధుని వాఙ్మయములో వచనములను ''భవ్యగీతములు''గా పేర్కొనడము పరికిస్తే వచనములు గీతములు ఒకే అర్థాన్ని సూచించే అంశాలుగా కనిపిస్తాయి. వచనములకు కొన్ని ప్రధాన లక్షణములు కలవు. అవి: (1) మకుటనియమము; (2) భాషానియమము; (3) ఏకైక భాక్తిక భావము; (4) ముక్తక స్వభావము; (5) ఆత్మాశ్రయ స్వభావం; (6) ప్రబోధ స్వభావం.

మకుటమనగా కిరీటము, వచన కారుడి రచనము లన్నింటికీ ఒకే మకుటము పాటించు నియమము పాలించబడినది. బసవ వచనములకు ''కూడల సంగమ దేవా!'' అను మకుటము ఉపయోగించ బడినది. వచనములలో సరళమైన కావ్యభాషను ఉపయోగించ బడినది. సరళ భాషా నియమము వచనములన్నింటిలోను ''శివ భక్తి'' ప్రతిపాదించబడినది జనసామాన్యములో శివభక్తిని పెంచాలన్నది వచన కారుడి లక్షాలలో ప్రధానమైన అంశం. ఏ వచనమునకా వచనము స్వతంత్ర్యముగా ఉండడమే ముక్తక స్వభావమును సూచించును. కవి తన స్వీయానుభవ వేద్యమైన విషయాలను సుస్పష్టముగా వచనములలో ప్రదర్శించుటే ఆత్మాశ్రయ స్వభావం, వచన కారుడు చదువరికి ఒక అంశాన్ని లేదా కొన్ని నైతిక, పారమార్థిక, సైద్ధాంతిక అంశాలను బోధించడము వలన వచనములు ప్రభోదాత్మికములైనవి.

బసవ వచనాల ప్రభావం తెలుగు దేశంలోగల జన జీవన ప్రవంతిలోని అన్ని రంగాలలోను గుణాత్మకంగా గోచరిస్తుంది. తెలుగు సాహిత్య చరిత్రలోని ప్రధాన ఘట్టాలైన శివకవి యుగంగా భావింపబడే సోమనాధయుగం శ్రీనాధయుగంలో వెలువడిన గ్రంథాలన్నింటిపైన బసవవచనాల ప్రభావం గణనీయంగా కనిపిస్తుంది. వేమన కృతులు బసవభావాలకు ప్రతిబింబంగా కన్పిస్తాయి. ధార్మిక రంగములో నాస్తిక ప్రభావాన్ని క్షీణింపచేసి భాక్తిక భావాలకు అంకురార్పణ చేసిన పోతన వంటి భక్తులకు భక్తిసాహిత్యసృష్టికి ప్రేరణ కల్పించింది సమాజంలోని కులతత్వం, మతఛాందసం, అంధవిశ్వాసం, మూఢాచారం ఇత్యాది దోషాలు ప్రక్షాళన చేయు కృషిలో బసవ వచనాలు క్రియాశీలక భూమిక నిర్వహించాయి.

బసవ వచనాలతో ప్రత్యక్ష అనుబంధం పెంపొందించడానికై ''వచనానువాదాలు'' వెలువడినవి. ఈ ప్రక్రియకు శ్రీకారము చుట్టిన ఘనత లింగైక్య రేకళిగె మఠం వీరయ్య గారికి వీరభద్ర శర్మ, లింగైక్య రవికోటి మఠం వీరభద్రయ్య ప్రోత్సాహంతో వెలువడిన వీరయ్య గారి అనువాదం ఎన్నో అనువాదాలకు దారి తీసింది. వీటిలో శ్రీముదిగొండ శివప్రసాద్, శ్రీ బాడాల రామయ్య గారి అనువాదాలు ప్రధానమైనవి.

పండిత శ్రీ రాచవీర దేవర గారొసంగిన ప్రస్తుత అనువాదం పూర్వానువాదాలకన్న మిన్నగా నుండి అధిక వైశిష్ట్యాన్ని సంతరించుకొంది. బహుభాషా పాండిత్యం, వేదాగమ పరిజ్ఞానం,

గురుపుంగవ సాంగత్యం, శివానుభవ సంపాదన మొదలగు విలక్షణ గుణగణములు గల దేవర గారు వచనములను సమగ్రంగా అధ్యయనం చేసి, వచన కారుడి హృదయాన్ని విప్పి చూపే ప్రయత్నం చేయడం జరిగింది. అందును జంగమ ప్రాశస్త్యమును బసవనినోట బలికిన వచనముల నేరి ఉట్టంకించి యున్నారు, దీని పఠనము వలన కొందరి యూహోహలు దొలగిపోవున నుటలో సందేహము లేదు, కావున భక్తి ప్రేరితులందరు ఈ పుస్తకమును దప్పకుండ జదివి తీరవలసినదే, భాషకు, భావానికి సమపాళ్ళలో ప్రాముఖ్యతనిచ్చి అనువాద వచనాలకు ప్రతిబింబంగా తీర్చిదిద్దిన దేవర గారి ప్రతిభ శ్లాఘనీయమైనది. వీరశైవులలో సామాజిక సమైక్యత యొక్క అవశ్యకత గుర్తింపు పొందవలసిన ఈ తరుణంలో విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని ప్రబోధించి వారి సామాజిక చైతన్యం వికసింపజేసే కొన్ని వచనాలు తెలుగులో అందించడం దేవర గారి సామాజిక సేవానిరతికి తార్కాణం. ధార్మికంగా త్రిలింగ (గురులింగ, శివలింగ, జంగమ లింగ) భక్తిని పెంపొందించే ఈ వచనాలు తెలుగు వీరశైవ ధార్మిక వాఙ్మయమునకు అమూల్య అభరణములుగా ప్రకాశింప గలవు, వృద్ధాప్య సంజనిత క్లేశములను లెక్కజేయక దేవరగారు చేసిన సేవను అందరూ మెచ్చుకోవలసిందే. వారికి బసవన్న కృపలభించ గలదని విశ్వసించుచున్నాను.

– శివం భూయాత్ –

# తొలిపలుకు

ఆంధ్ర ప్రదేశమున ఒకప్పుడు ప్రఖ్యాతిగాంచిన సర్వశ్రేష్ఠమైన వీరశైవ ధర్మము నేడు ఎటు జూచినను దిన దినము క్షీణదశను జెందుచున్న దానిని గమనించి, ఈ పవిత్ర ధర్మమున జన్మించిన నాకు భరించరాని యావేదన హృదయ స్పందన గలుగడము చేత నా జన్మను సార్థక పరచుకొనుటకై నా యథాశక్తి సుమారు ఒక లక్షపై వరకు నా సొంత డబ్బును వెచ్చించి శైవ - వీరశైవ ధర్మోన్నతిని కాంక్షిస్తూ కొన్ని ప్రాచీన గ్రంథములను బరిశీలించియు మరికొంత వరకు స్వకీయానుభవము చేతను వీరశైవ ధార్మిక సాహిత్య - సాంస్కృతిక గ్రంథములను రచించి సుమారు 27 గ్రంథములను అచ్చు వేయించియున్నాను. మరికొన్నింటిని అచ్చు వేయించవలసియున్నది, వాటిలో ఇరువదియెనిమిది ఆగమముల సారభూతమైన వీరశైవ ధర్మమునకేకైక మూలగ్రంథమైన జగద్గురు శ్రీ రేణుకాచార్యులవారు శ్రీ అగస్త్యమహర్షుల వారికి వీరశైవ సిద్ధాంతమును బోధించి ప్రప్రథమమున వీరశైవ ధర్మమును స్థాపించి శ్రీవారి భూలోకమున సిద్ధాంత శిఖామణియను సంస్కృతము మరియు కన్నడములకు తెలుగు వ్యాఖ్యను మరిన్ని వీరశైవ ధర్మోద్ధారకులైన శ్రీ బసవేశ్వరుల వారి కన్నడవచనాలకు తెలుగుకనువాదమును మరియు వీరశైవ ధర్మము యొక్క సూక్ష్మాతి సూక్ష్మవిచారములు

గల శివయోగి శివాచార్య కవి విరచితమైన శతకత్రయము ( భక్తి - జ్ఞాన వైరాగ్యములుగం) కన్నడ పద్య గ్రంథమునకు తెలుగు వ్యాఖ్యవ్రాసి యున్నాను, దీనిని వీరశైవ ధర్మాభిమానులందరును జదివి తీరవలసినదే, ఏలనన ఇందులోని విషయములు చాలా చాలా చిత్రాతి విచిత్రములుగా ప్రతిపాదించబడినవి, ఈ కవి శిరోమణి గ్రథిత సిద్ధాంతములు వినూత్న ఫక్కీలో నున్నవి. వాటిలోని వాస్తవ విషయములను వివరించిన మనుషులెవరును కాదనక అంగీకరింతురని నా విశ్వాసము. విషయమునకు దగిన సులభైక బోధకములైన దృష్టాంతములతో ధార్మిక సిద్ధాంతములను నిర్మలమైన దర్పణములా విశదీకరించబడినది.

ఇందలి సూక్ష్మవిషయములు కన్నడ వాఙ్మయమున నుంట వలన ఆంధ్రుల కవగతము గ్గాలేదని నా విచారము. అందుకుగాను బహుగ శ్రమించి ఈ గ్రంథములోని విషయములను తెనుగించాను.

ఇకపోతే మానవ శరీరము అస్థిరమైనది గనుక సర్వేంద్రియ పటుత్వము గలిగి జ్ఞానైక సాధ్యమైనప్పుడే ఇట్టి సాహిత్య సేవగాని లేదా సాంస్కృతిక సేవగాని మానవుడు జేయంగలుగుతాడు. వృద్ధాప్యము తటస్థించి ఇంద్రియు లోపమేర్పడినప్పడేమి చేయలేడు, కావున ''యస్యకీర్తి: సజీవతి'' సాహిత్య సేవ జేసిన వారుగాని శాశ్వత కార్యములను జేసినవారుగాని వారు మరణించినను జిరస్థాయిగా వారి కీర్తి ప్రతిష్టలు చెరగకుండా నిలచి యుండుటను ఈ వరకు మనకాదర్శపురుషులైన గ్రంథకర్తల మరియు సాంఘిక -

సాంస్కృతికముగా దేశ సేవలోనర్చి యమరులైన మహనీయుల పేర్లను వింటూనే ఉన్నాము. అందుచేత మానవ సమాజములో యున్నంత వరకేదో విధముగా తన శక్త్యానుసారముగా సమాజ సేవ యొనర్చుట మానవకర్తవ్యమై యున్నది. అందుకే ఒక మహాకవి ఈ విధముగా సెలవిచ్చాడు.

''వైదికం కర్మకుర్వీత – జ్ఞానైక ఫలసాధనం
న కుర్యాత్పాశవీంకర్మ – వీరశైవ: కదాచన'' అని

వీరశైవుడైన వాడెల్లప్పుడు జ్ఞానైక ఫలసాధనమైన వైదిక కర్మనే ఆచరించాలి గాని, పశు కర్మము నాచరిచవలదని సూటిగా జెప్పి సర్వ మానవులకుద్బోధించియున్నాడు, ఈ పై వాక్యము కేవలము వీరశైవులకే గాకుండా సమస్త మానవాళికిని వర్తిస్తుంది.

ఆ కారణమున నేను సమాజ శ్రేయోభిలాషినైనాయోపిన కొలది ఎవరిని ఆర్థికముగానాశించక, యాచింపక, నా యథాశక్తి యీ గ్రంథముల రూపమున, ఆకాశవాణి – దూరదర్శన్ మరియు పత్రికలలో లేఖల రూపమున ఉడుతా భక్తితో, సేవ యొనర్చుచున్నాడను, మనీషులు, సహృదయంతతో నా గ్రంథములను కొని బలించి ఇందున్న దొసగులను వదలి సూక్తులనే గ్రహింప ప్రార్థన.

ఇట్లు

# గ్రంథకర్త


## పం. పెద్ద మఠము రాచవీరదేవర తీర్థ ఎం.ఓ.ఎల్.

ఇం.నెం. 3-3-139, కాచిగూడ, హైదరాబాదు – 500 027. (ఎ.పి.)

"ఓం"

# శ్రీ జగద్గురు రేణుకాచార్య గురవేనమః

# శ్రీ గురు బసవలింగాయనమః

# శ్రీ బసవేశ్వర వచనామృతము

## ప్రార్థన :

1. విశ్వము కంటెను విశాలము
మిన్నుకంటెను మిక్కిలి విశాలము
పాతాళమున కంటెను పదిలమగు మీ శ్రీ పాదము
బ్రహ్మాండము కంటెను భద్రమగు మీ శ్రీ మకుటము
అగమ్యాగోచరంబగునప్రతిమలింగమా !
కూడల సంగమదేవయ్యా ! మీరునా
కరస్థలమునకు వచ్చి స్థిరపడ్తిరయ్యా || ౧ ||

2. నా యోగ - క్షేమములు మీ వే అయ్యా!
నా హాని - వృద్ధులు మీవే అయ్యా!
నామానావమానములు మీవేఅయ్యా!
తీగకు కాయ బరువా ? కూడలసంగమ దేవయ్యా || ౨ ||

3. చకోరమునకు చంద్రునివెన్నెల చింత!
అంబుజమునకు - భానూదయము చింత!
భ్రమరమునకు - మకరందమాధుర్యమును చింత!
నాకు మాకూడల సంగమదేవుడిని
స్మరించునదే చింత || 3 ||

4. భానూదయము - పద్మములకు ప్రాణము,
చంద్రోదయము - కలువపూలకుప్రాణము
సత్పురుషుల కూటమి సజ్జనుల కుప్రాణము
కూడల సంగన శరణుల రాక నాకు
ప్రాణాధారమయ్యా || ४ ||

5. నేనిన్ను స్మరింతును, నీవునన్నేలుంగవైతివి
నేనిన్ను స్తుతింతును నీవునన్ను జూడవైతివి
నేనెట్లు జీవింతునయ్యా!
కూడల సంగమదేవా!
నాకునీవే ప్రాణము, గతివి - మతివి చూడుమా! || ౫ ||

6. తండ్రివినీవే - తల్లివినీవే
బంధువునీవే - బళగమునీవే
నీవుగాక మరెవ్వరు లేరయ్యా
కూడల సంగమదేవా!
పాలముంచినను నీటముంచినను || ౬ ||

7. నా విపత్తు - సుఖము - దుఃఖమునీవేగదయ్యా!
నాకుమరెవ్వరునులేరయ్యా!
హరహరానీవే నన్ను కరుణ జూడుమయ్యా !
నామాతాపితరులు నీవే కరుణించుమయ్యా!
కూడల సంగమ దేవా ! || ౭ ||

8. నాజన్మమును ప్రక్షాళనమొనర్చినధార్మికుడివి !
నాజన్మమును దొలగించిన ధార్మికుడివి!
నా సంసారపాశమును దొలగించిన వాడివి
అని నాకు శివుడేగతియని నమ్మితినయ్యా!
నాయష్టమదములను భస్మమొనర్చితివయ్యా!

పట్టుదలవీడకనీపాదము గంటినయ్యా!
సృష్టిప్రతిపాలక మిమ్ము నమ్మినాడను,
కరుణించుమా! కూడలసంగమదేవా || ౮ ||

9. భవరోగమునకు వైద్యుడవని
నీకు శరణాగతుడనైతిని
భక్తిప్రదాయక నీవు కరుణించుమోలింగ-తండ్రి!
జయ జయ శ్రీమహాదేవ
జయ జయ శ్రీమహాదేవ
జయ జయ శ్రీమహాదేవ
అనినుడువుచుండెను నా మనసు
కూడల సంగమదేవునకు
శరణనుచుండినది నా మనసు

10. హృదయము వికసింపమి, నాలుక నర్తింపమి
మీ నామామృతమునలంకరింప జేయుము
నాకు నా తండ్రి! మొగ్గదొడగిననామనసు
మీ శ్రీ పాదముపైబడి వికసించుగాక
కూడల సంగమ దేవా! || ౧౦ ||

11. ఇది వారమనియు, ఇది దినమనినే యెరుగనైతిఁ
ఇది రేయియనియు ఇది పగలనినేనెరుగను
మిమ్ము బూజించి నన్ను నే మరచితిని
కూడల సంగమ దేవా! || ౧౧ ||

12. వాణియందు మీనామామృతము పూరించి
నయనమునమీయాకృతిని బూరించి
డెందమున మీధ్యానమునుబూరించి
కర్ణమున మీ కీర్తిని బూరించి

కూడలసంగమదేవా! ॥ ౧౩ ॥
మీ చరణకమలమునందు నన్ను భ్రమరముగానుంచుము

13. నాకుమిమ్ము స్మరించునపుడే ఉదయము
నాకు మిమ్ముమరచినపుడే అస్తమానము
నాకు మీధ్యానమే ప్రాణము సుమాతం(డిస్వామి,
నా హృదయమందు మీ చరణధ్యానమునే
స్థిరపరచుమయ్యా!
నా ముఖమునందు పంచాక్షరినివ్రాయుమయ్యా!
కూడలసంగమదేవా ॥ ౧౪ ॥

14. బంగారు పాదుకలను దొడగినవాడిని
పైకెత్తి కట్టిన కెంపు జడలుగలవాడిని,
మేన విభూతినిదాల్చిన వాడిని
కరమున కపాలమును బట్టినవాడిని
అర్ధనారీశ్వరుడైన వాడిని
బాణునిద్వారమును గాచిన వాడిని
నంబికిదార్పుగాడైన
చోళునకు స్వర్ణవర్షమును గురుపించినవాడిని
సద్భక్తుల హృదయమునసెలకొన్న వాడని
చేసిన పూజలకు ప్రసన్నుడైన వాడిని
కూడలసంగయ్యనునాతని ॥ ౧౫ ॥

15. సంసారమనెడు శ్వానమును బారదోలి
నిర్మల హృదయుని జేసితివయ్యా
నాచిత్తమున నీధ్యానమయ్యా!
నీవుగాక మరెవరిని యెరుగనయ్యా
కన్యావస్థలో పాణిగ్రహణమొనర్చితిని
మీలోగలిసితిని

మన్నించు మామహాలింగమా !
సతినేను పతినీవే అయ్యా
ఇంటియజమాని ఇంటిని గాపాడురీతి
నీవునామనసును స్థిరపరచినపతివి.
నిన్నువలచిన మనసు అన్యుల పైబరపిన
నీకభిమాన భంగము
కూడలసంగమదేవా || ౧౮ ||

16. ప్రకాశమునందలి ప్రకాశము మహాప్రకాశము,
శివశివా పరమాశ్రయమేతానై
శతపత్రకమల కర్ణికామధ్యనీ, స్వతః
సిద్ధుడైయున్నమా కూడలసంగమదేవా || ౧౯ ||

17. లగ్నమెక్కడిది ? విఘ్నమెక్కడిదిరా సంగయ్యా!
దోషమెక్కడిది, దురితమెక్కడిద్విరా సంగయ్యా!
మిమ్ము నే మారకుండ స్మరించువారికి
భవకర్మమెక్కడిది రా సంగయ్యా || ౨౦ ||

18. పల్లకినెక్కిన శ్వానము మాదిరి, కనుపించి
నవీడదు తనమొదటి స్వభావమును,
కాల్చు కాల్చుమీ మనసు విషయములకు
పోవును, మృత్యుంజయా నిన్ననారతము
స్మరింపనీయదు, నా ప్రభూ! కూడల
సంగమదేవ, మీ చరణకమలములస్మరించు
నటుల కరుణించు మా! ఉడిజాపివేడుదు
ను మీ ధర్మము కూడలసంగమదేవా || ౨౨ ||

19. విషయమను పచ్చికను నా యెదుట దెచ్చి
యుంచితిరయ్యా! పశువేమెరుగును లే

బచ్చికనాశించును, విషయ రహితునిగా
వించి భక్తిరసమును దృప్తిగదినిపించి, సు
బుద్ధియను నీరుబోసి గాపాడు
మయ్యా! కూడలసంగమదేవా ॥ ೧೫ ॥

20. జ్ఞానశూన్యమైన పశువు పంకమున బడిన
నథికాళ్ళుగొట్టు కొనునేగాని వెరొండుతెర
వుగలదా! శివశివా అదిగాంచి బహుగ
చింతించితినయ్యా! మీ చిత్తము వైపు
నన్నుమళ్ళించుమయ్యా! పశువును నేను
పశుపతివి నీవు, దొంగ పశువని
నన్ను బట్టికొట్టకముందె, యజమా
నియైననిన్ను దూషించకముందె నన్నుగా
పాడవయ్యా కూడలసంగమదేవా ॥ ೧೬ ॥

21. చిట్టడవిలోనన్ను చిట్టి చిలుకను జేసిపెంచి 'శివ'
శివాయనిపించవయ్యా! భక్తియను పంజర
మునందుంచి పోషించుమయ్యా!
కూడలసంగమదేవా ॥ ೧೭ ॥

22. భక్తియననెట్టిదయ్యా దాసయ్య జెసినదయ్యా
భక్తియెట్టిదనిన సిరియాళుడుజేసినట్టిదయ్యా
భక్తియెట్టిదనిన కూడలసంగమదేవా నీవు
బాణునిద్వారమునుగాచినంతటిదయ్యా ॥ ೧೮ ॥

23. నమ్మునమ్ముమా! భేదభావము లేకుండసామ
వేదవేత్తల మాదిరి
నమ్మునమ్ముమా! దాస- దుగ్గళితెరది,
నమ్మునమ్ముమా! సిరియాళ చెంగళిమాదిరి,

నమ్ము నమ్ముమా! సింధుబల్లాళుని మాదిరి
నమ్మినచో తనువునీ కప్పగింతును,
కూడలసంగమదేవా || ౨౯ ||

24. అష్టవిధార్చన షోడశోపచారమునుజేయుట
చేసిన పూజను దిలకించుట, శివతత్వగీతము
నుబాడుట, శివుని యెదుట చిందులు వేయుట
భక్తి సంభాషణ జేయుట,
మా కూడలసంగమదేవా || 30 ||

25. సుప్రభాతసమయాన, మనసారస్మరించిన,
తప్పును, అపమృత్యువు, కాల కర్మంబులయ్యా!
దేవుని బూజించిన పాశబంధనములు బాయును
శంభుని మార్గ దర్శనము రెప్పగొట్టని కనులచేత,
సదాసన్నిహితుడై శరణాగతుడనని నమ్ముట
జంగమార్చన జేయుట, కూడలసంగమదేవా || 30 ||

26. నాద ప్రియ శివుడందురు
నాదప్రియ శివుడు గాడయ్య
వేదప్రియ శివుడందురు
వేదప్రియ శివుడుగాడయ్య
నాదమొనర్చిన రావణునకు
ఆయువు సగము తగ్గెను
వేదమున్ జదివిన బ్రహ్మకు
శిరముబోయెను, కావున
నాదప్రియుడుగాడు
వేద ప్రియుడునుగాడు
భక్తిప్రియుడు మా కూడలసంగమదేవుడు || ౩౨ ||

27. సంగీతము బాడిన నేమి ?
శాస్త్రపురాణముల వినిననేమి ?
వేదవేదాంతముల జదివిననేమి ?
మనసుమెచ్చి
లింగజంగమంబులను బూజింపనె
రుగనివారు అందరిలోననుభవజ్ఞులైననేమి ?
భక్తి శూన్యులను దరిజేరనీయడుసుమా!
మా కూడలసంగమదేవుడు || 33 ||

28. ఆడిననేమి? పాడిననేమి? జదివిననేమి?
త్రివిధ దాసోహములేనిదే
ఆడదానెమిలి, పాడదాతీగ చదు
వదా చిలుక? భక్తిశూన్యులను
సమ్మతింపడు, మా కూడలసంగమదేవుడు || 34 ||

29. అర్థ ప్రాణాభిమానములందు
వంచనలేని భక్తి సమయాచారము
జంగమమె లింగమనుటకేది ప్రమాణము ?
మనసుననున్న విషయవాసనలవీడని
యజమానిరాకకు కుక్కతోకాడించిన
తప్పేమి? తరుగేమిటి ?
మా కూడలసంగమదేవా || 35 ||

30. రానురాను భక్తి కొరవడినదయ్యా!
మొదటిదినమునొసలు ముట్టి
మరుసటిదినమున చేతితో ముట్టి
మూడవదినమున కునికిపాటు చూడుమా!
పట్టిన దానిని విడువకుండిన
కడతేర్చును

లేనిచో మధ్యనీటిలో ముంచును
మా కూడలసంగమదేవుడు || 3౬ ||

31. పాలనేమము పాలమీగడనేమము
మీగడలేనిచో పులిహోరనేమము
వెన్ననేమము బెల్లం నేమము
అంబలి నేమమున్నవారినొకని జూడనైతిని
కూడలసంగని శరణులతో
అంబలినేమమువాడు, మాదారచన్నయ్య || 3౭ ||

32. మట్టిమూకుడును దెచ్చి యెంతగడిగినను
దానిమట్టిగుణమును వీడునా!
నాదేహమందుండిన చెడుగుణములను
దోగొట్టియనుగ్రహింపుమయ్యా!
కంబళమున పిండిపిసికినట్లుగా
చూడుమానామనసు, కూడలసంగమదేవా
నీకు శరణనుటే పరిశుద్ధిజూడుమా || 3౮ ||

33. గాంచనగునా - పరుషపు పర్వతము గ్రుడ్డికి
తెలియదగునా అమృతంపుభావిదరిద్రుడికి
పిదుకనగునా? కామధేనువపశుద్ధునకు
లభ్యమగునా? నిక్షేపము దరిద్రునకు
మెరుపుకీటమును గాంచినక్కతనతోకను
గాయపరచుకొనినట్లుగా పోనగునా ?
నా స్వామి కూడల సంగమ శరణులను
పుణ్యము లేనిదే జూడ దగునా ? || 39 ||

34. తామసమాక్రమించిన గన్నుల జెరచెను భక్తి
కామమనునగ్నికాహుతిగావించెను భక్తి

ఉదరమునకై మరమరగిముందు జెరచెను
ఇతరుల నాశ్రయించుటకై పరుగిడెను నాభక్తి
శవపేటికను నేను కూడలసంగమదేవా
క్షణమైనను మమతతో నుండనీదునా
కపట భక్తి ॥ ४० ॥

35. శబ్దసుఖమునకుమెచ్చి
మాటకు మాటసమాధానమిచ్చి
చెడితినయ్యా!
అనుభవము జాలని, చపలచిత్తుడనైతినయ్యా!
అమృతముతోగడవనింపి, పగుల గొట్టి
విచారింపదగునా ?
స్వామి సేవకసంబంధమేనాదు భక్తి
ప్రత్యుత్తరమిచ్చిన అఘోరనరకము
కూడలసంగమదేవా ॥ ४० ॥

36. శక్తిలేని కుక్క
శశకము నేమి బట్టునయ్యా?
శక్తిలేని వీరుడు నటించునట్లు
చెప్పకొనుటేసిగ్గుచేటు
నేనుభక్తుడనెట్లగుదునయ్యా!
కూడలసంగమదేవా ॥ ४२ ॥

37. దాసిమయ్యతనవస్త్రమునిచ్చి
మీధననిధి ప్రసాదమును బడసెను
సిరియాళుడుదన పుత్రునొసగి
ప్రాణప్రసాదమును బడసెను
బల్లాళదేవుడు దనవధువు నొసగి

సమతాప్రసాదమును బడసెను
వీరందరు తమతమ శక్తిననుసరించి
బడసిరి సమ్యక్పదవిని
నేనేమియునెరుగనివాడిని
భక్తి నిరుపేదకు గరుణించుమా!
కూడలసంగమదేవా || ౪౩ ||

38. హస్తి ఆదాలిని బోయెననిన
అజము ఆదాలిన బోయెననదగునా ?
సంగన శరణులకు నేను సరితూగుదునని
చెప్పకొనదగునా ?
జంగమసేవ జేయు భక్తులకునేను
సరితూగగలనా ?
చెప్పమా! కూడలసంగమదేవా || ౪౪ ||

39. అరిచేతనున్న లింగము న్నిరీక్షిస్తు
దృష్టిని నాసికాగ్రమునుండినిరీక్షిస్తు
ఆనందబాష్పములు రాలగా
దృష్టేప్రాణముగా భావింతునా?
సంగమమునే ప్రాణముగా భావింతునా ?
నా అంగవికారము యొక్క సాంగత్యమునువీడి
కూడల సంగయ్యా లింగయ్యా
లింగము లింగము లింగమనివేడుతూ నై || ౪౫ ||

40. సముద్రము గొప్పదందునా ధరణి పైనున్నది
ధరణి గొప్పదందునా? నాగేంద్రుని ఫణామణిపై
నున్నది, నాగేంద్రుడే గొప్పవాడందునా ?
పార్వతియొక్కచిటికెనవ్రేలి ముద్రికయయ్యెను

అట్టిపార్వతే గొప్పదందునా ? పరమేశ్వరు
నికి అర్థాంగినియయ్యెను, అట్టిపరమేశ్వరుడే
గొప్పవాడందునా ? మాకూడల సంగమ
శరణుల మనసుతుదచివరిభాగమున
అణగియున్నాడు || ౪౬ ||

41. గృహమందు గృహస్థుడున్నాడోలేడో ?
గడపముందు గడ్డిపెరిగి గృహమందు కసునిండినది
గృహమునందు గృహస్థుడున్నాడోలేడో ?
తనువునమైలనిండి మనమున విషయవాసన నిండి
గృహమున గృహస్థులేడు, కూడలసంగమదేవా || ౪౭ ||

42. నక్కయెరుంగునా? అటుకుల రుచిని
కాకినందన వనమునందుండిననేమి ?
కోకిలయగునా !
కొలను తీరమున నొక కొంగయుండిననేమి ?
నది రాజ హంసయగునా ?
కూడలసంగమదేవా || ౪౮ ||

43. ఎంత కాలము శిలనీటిలో నున్న నేమి?
నాని మెత్తబడునా? ఎంతకాలము మిమ్ము బూజించి
ననేమి ఫలము? మనసులో దృఢత్వములేనిదే?
నిక్షేపమునుగాపాడుచున్న భూతము లీతిగా
దానివిధినాదయ్యెనుగదా। కూడలిసంగమదేవా || ౪౩ ||

44. ధనమునందునిరపేక్షత
ప్రాణమునందు నిర్భయము
ఇదేలిన సాధ్యపడుతుందయ్యా?
నిధితానై లభించినచో

వలదనువారు లేరుసుమా?
ప్రమాదవశముతో వచ్చిన కాదను
వారులేరు. నిరాశనిర్భయము
కూడల సంగమదేవా
నీవలచిన శరణుని కిగాకమానదు. (54)

45. పరుగులిడుపామునకు వెరువను
మండేజ్వాలకు భయపడను
ఖడ్గముపదునుకు వెరువను, కాని,
ఒక దానికి జంకుదును మరొకదానికి
బయపడుదును.
పరస్త్రీ పరధనమునకు వెరుతును.
తొల్లి భయపడని రావణుగతియేమయ్యెను
నేను భయపడుదునయ్యా
కూడల సంగమదేవా (54)

46. వేటగాడొక కుందేలును
దెచ్చిన దానిని పెంచుకొనుటకై కొనెదరు
ధరణిపతి శవమనిన కొనువారుండరు.
చూడుమా! ఆ కుందేలుకంటెను జులకన ఈ
మానవజన్మ దృఢముగా విశ్వసించుమా
కూడల సంగమదేవా (56)

47. ఉత్పత్తి శుక్లశోణితమునుండిగలగిన
లజ్జచాలదా! మరల దురితములకు
తలొగ్గుటెందులకయ్యా!
మృత్యు నోటబడి చావడమెందులకయ్యా! మాటిమాటికి
రానున్న జన్మమును జయించుటయనుదానిని దొలగించు

కొనుటకై కర్తయగు మా కూడల సంగమ దేవుని భక్తి
మీర పూజింపుము (57)

48. చెడునడువమి, చెడునుడువమి
అన్యులను విమర్శింపమి
ఏలయనుగ్రహింపదయ్యాలింగము
ఏల దర్శనమీయదయ్యాతాను.
ఏల కోరినవి కోర్కెలు దీర్చడు
విశ్వసించిన శివభక్తునకు
ఇదే శ్రేష్ఠమైనది కూడల సంగమదేవా. (58)

49. స్వామివి నీవు, శాశ్వతుడివి నీవు
ఎత్తిన బిరుదు జగమంతదెలియగ
మహాదేవ మహదేవ
ఇటనుండి మరో శబ్దమేలేదు
పశుపతి జగమునకు ఒకే దేవుడు
స్వర్గ–మర్త్య పాతాళములలో
ఒకే దేవుడు కూడల సంగమదేవుడు (60)

50. ఇద్దరు ముగ్గురు దేవుళ్ళని
ఉబ్బిమాట్లాడదగదు,
దేవుడొక్కడే చూడుమా!
ఇద్దరనునది కల్ల చూడుమా?
కూడల సంగమదేవుడొక్కడేయనెను వేదము (61)
''ఏకోదేవః శివోనాకేశవోవా'' వేదములోని
ప్రమాణముగలదు.

51. దేవుడొక్కడు నామములనేకములు
పరమపతివ్రతకు పతియొక్కడు

మరొకరికిదలవంచిన
చేవి ముక్కులను ఛేదించును.
పలుదేవుళ్ళఎంగిలినిదినువారినేమనాలి?
కూడల సంగమదేవా (౬౨)

52. కర్తను బూజించి కుత్సితదేవుళ్ళకు నమస్కరింతురు.
గాడిదగుళ్ళిములకు బుట్టిన కంచరగాడిదవలె.
భక్తులనెట్లనాలి - భృత్యులెట్లనాలి?
శరణులనియెట్లనదగువారిని
రెండు భావనలుండిన మానవులను
మెచ్చుకొనడుమా కూడల సంగమదేవుడు (౬౩)

53. చూచినవారినందరిని భర్తగా భావించెడు
వ్యభిచారిణి (రంకుటాలని) ని సజ్జనురాలనదగునా?
లింగప్రసాదమును భుజించి యితర దేవతలను
కొనియాడు వారిని, మా కూడలసంగమదేవుడు
అట్టినీచులకు జేయును బురువులగుంటను (౬౪)

54. నమ్మిన భార్యకు భర్త ఒక్కడే సుమా!
నమ్మికయుండిన భక్తునకు దేవుడొక్కడేసుమా!
వలదు వలదు అన్యదైవము సంగమువలదు.
వలదు వలదు అన్యదైవముమనునది వేశ్యవంటిది.
కూడల సంగమదేవుడు జూచిన ముక్కుచెవులను
గోయును సుమా (౬౫)

55. ఓ రోలి పాపకర్మంబొనర్చినపాడ
''జాగ్రత్ స్వప్న సుషుప్తియందు''
మరొకరిని స్మరించిన శిరచ్ఛేదనము జేయును
కూడలిసంగమదేవా నినుగాదని

మరొకరిని స్మరించిన శిరచ్ఛేధనము జేయుము
కింకర భావము (67)

57. కాలమునకు - ఋణమునకు - దారిద్ర్యమునకు
భయపడి మిమ్ము శరణు జొచ్చితినయ్యా!
ఏది సత్యమందును ఏదియసత్యమందును?
ఇది నీవేగుర్తించుమయ్యా కూడల సంగమదేవ
నేను ఉదర పోషకుడనయ్యా (68)

58. ఆయేనుగు ఆకారమును సూకరము
నకు బోల్చిన అదియేనుగగునా?
భూలోకము (పు) నాగసర్వమునా కృతిని
ఆదిశేషునకు బోల్చిన అదియాదిశేషుడగునా ?
నేను భక్తుడనైతేనేమి మాకూడల సంగమ
దేవుని సద్భక్తులకు బోల్పదగునా ? (70)

59. వృక్షము నీడన యుండి తననీడను వెదుకదగు
నా ? మీ శివశరణులయెదుట నేనెంతటి భక్తు
డనయ్యా! మీ శివశరణుల యెదుట నే నెంతటి
ముక్తుడనయ్యా? నేను భక్తుడననుమాట
కాల్చదా? కూడలసంగమదేవా (72)

60. నా కంటెను పిన్నలు లేరు.
శివభక్తుల కంటెను పెద్దలు లేరు
మీ పాద సాక్షినామనసే సాక్షి
కూడల సంగమ దేవా? నా కిదేశ్రేష్టమైనది. (73)

61. నాలో భక్తి ఆవగింజలో ఆరవ భాగమైననులేదు సుమా!
నన్ను భక్తుడందురు, నన్ను సమయాచారి

అందురు నేనేమి పాపము జేసితినో (గదా)
పెరుగక మొదలేకొయ్యదగునా?
అయ్యా యుద్ధమెరుగని వీరుడు నటించిన రీతిగా
పెద్దలందరు నన్నుపెద్దగా పొగడుదురు.
ఇది నా కర్మయందునా కూడల సంగమదేవా (74)

62. భక్తులను జూచిన ముగ్ధు లగుదురు
జైనుల ను జూచిన నగ్నులగుదురు
విప్రులం జూచిన హరినామ జపముజేతురయ్యా?
వారి వారిని జూచిన వారి వారి యంతెనటింతురయ్యా
కుల ముక్తుల బుట్టిన వారిని జూపకుమయ్యా!
కూడలసంగమదేవుని బూజించి,
ఇతర దేవతలకు తలొగ్గి భక్తులమని జెప్పకొనెడి.
అజ్ఞానులనే మనదగునయ్యా (75)

63. భర్త శివలింగదేవుడి భక్తుడు
భార్య పోచమ్మ మైసమ్మ ల భక్తురాలు
భర్త స్వీకరించునది పాదోదకప్రసాదాలు
భార్య సేవించునవి మద్య మాంసాలు
భాండభాజన పాత్ర శుద్ధి లేని వారి భక్తి
సురాభాండమును బయట గడిచిన విధమగు
కూడల సంగమదేవా (76)

64. సంసారమొక సుడిగాలి వంటిది సుమా!
సంపదయనునదొక సంతలోనిజనమువంటిది
చూడుమా! దానికిలోనై చెడకుసుమా?
సంపదశాశ్వతమైనదిగా దుసుమా? ఏమారక
పూజించుమా కూడల సంగమ దేవుని (78)

65. ఓరోరి మానవుడా! అతియాశవలదురా!
దట్టమైన వెన్నెల స్థిరమైనది కాదుసుమా!
శాశ్వతమైన పదమునను(గహించుమా
కూడల సంగమదేవుని మరువక బూజించుము (79)

66. తేలు గర్భము దాల్చుటె అంతము
అరటికి ఫలించుటె అంతము
రణరంగమున పోరాడువసేవకునకు
వెన్నుజూపుటె అంతము, క్రియనాచరించు
భక్తునకు మనసుశూన్యమైన అదే అంతము
కూడల సంగమదేవా (80)

67. అహంకార పూరితుడైనచో
లింగము తానెట్లు వరించును?
అహంకారమున కవకాశమివ్వక
లింగతనుపైయుండ వలెను
అహంకారము లేమిచో
లింగము సన్ని హితమగును సుమా!
కూడల సంగమదేవా! (81)

68. లోకపుదోషమును మీరేల చక్కబరచెదరు
మీ మీ తనువును చక్కపరచుకొనుడు
పొరుగు వారి దుఃఖమునకు దుఃఖించువారిని
జూచి మెచ్చడు మా కూడల సంగదేవుడు (82)

69. ఏమి వచ్చితిరా! అలసిపోతిరా! యనిన
మీ శరీరసంపద సమసిపోవునా!
వేగపలుకరించిన శిర ఉదరములు ముక్క
లగునా? ఇవ్వకుండినను సరెగుణహీను

డైనచో క్రిందబడపైచినాసికమును ఖండింప
కవదలునా? మా కూడల సంగమదేవుడు (83)

70. సంసారమున బుట్టివేరొండుదలపనేల?
మౌనముతో నుండి విఱ్ఱవీగు టెందుల కయ్యా
నవ్వుతు ముచ్చటిస్తుశివభక్తులతో (2)
శ్లో॥ అభ్యాసస్య విహీనస్య
తస్యజన్మ నిరర్థకం
గురోరపి సమంహాస్యం
కర్తవ్యంకుటిలంవినా
మా కూడల సంగమ శరణులతో
మనసు విప్పి ముచ్చటించుమయ్యా (84)

71. శివభక్తుడు దర్శించగనే శిరము వంచి శరణన
వలెనయా! మృదువాక్యములే సకలజపంబు
లయ్యా! సదువినయమెసదాశివుని ప్రస
న్నతకు మూలమయ్యా! కూడల సంగమ
దేవుడట్లొనర్చని వారిని మెచ్చడయ్యా? (85)

72. తనను కోపించిన వారిని దాను గోపింపనేల?
తనకైన హాని గొరత ఏమి?
ఇతరులకైన మేలేమి?
తనువుకోపము తన గౌరవమునకుహాని
మనసినకోపము తన జ్ఞానమునకు జెడు
ఇంటిలోని చిచ్చు తన ఇంటిని కాల్చునే
గాని ఇతరుల ఇండ్లను గాల్చనేరదు
కూడల సంగమ దేవా (88)

73. ప్రసన్నతలేని పూజ, ప్రేమలేని క్రియ
అట్టి పూజ అట్టి మాట
చిత్రములోనియాకారము జూడుమా!
ఆలింగనమొనర్చిన సుఖముండదు.
కూడల సంగమదేవా,
నిజాయితీ లేని వాడి భక్తి యట్టిది (౬౨).

74. స్నేహములేని చోట గుణముల వెదకదగునా!
అయ్యా వాడిన విరులలో పరిమళమును
వెదకదగునా! అయ్యా నా తండ్రి!
కూడల సంగమదేవా! ఏటి ప్రవాహము
తగ్గినచో నావికుడికేమి ఫలము! (౭౦)

75. మనసు లేని పనిని యెంతగా జేసినను
ఎంతగా దానమొనర్చినను సార్థక్యము
లేనిచో, చేసినది, ఇచ్చినది, నిజమ్మైనచో
కూడల సంగమదేవుడు మెచ్చుకొనునయ్యా! (౭౧)

76. చేసితిననునది చిత్తమున మెరసిన
ఘనముగ బీడించు శివునిడంగుర
చేసితిననకుమీ లింగమునకు
చేసితిననునది చిత్తమున మెదలనిచో వేడినదిచ్చు
కూడల సంగమదేవుడు (౭౨)

77. చిలుకజదివిన ఫలమేమి?
పిల్లిరాక నెరుగదు
జగమును గాంచు కన్నులు
తనప్రాణము దీయు మృత్యువునెరుగదు!
ఎదుటివారి గుణములనెరుగుదుమందురు.

తమ గుణముల తామెరుగరు
కూడల సంగమదేవా (౨౩)

78. ఉన్నవారు శివాలయమును గట్టింతురు
నేనేమి జేయుదును, నిరుపేదనయ్యా!
నా కాళ్లేస్తంబములు దేహమే దేవాలయము
శిరమే స్వర్ణకలశమయ్యా
కూడల సంగమదేవవినుమయ్యా!
స్థావరమునకంతముంది గాని జంగమున
కంతముండదు సుమా (౨౪)

79. ధాన్యమునుండి సాత్వికతేజస్సు
అలవడును
కరి జంకును అంకుశమునకు
గిరిజంకును వజ్రాయుధమునకు
కారు చీకటి జంకును జ్యోతికి
కాననముగంపించును కార్చిచ్చునకు
పంచమహాపాతకములు జంకును (౨౫)
కూడల సంగన నామముకయ్యా

80. పాతక శతకోటిని నశింపజేయుటకు
చాలదా? ఒక్క శివనామము?
చాలదా? ఒక్క హరునినామము?
కూడల సంగమదేవా!
మిమ్ము నమ్మిన వాడిని పశువుగా
మార్చినందులకు (౨౬)

81. నేను పిన్నవాడిని అల్పుడినియనే భీతి వలదు సుమా!
కరిఘనఅంకుశముచిన్నదనినుడువదగునా?

గిరిఘనవజ్రము చిన్నదనదగునా ? అనదగదు,
తమంధఘనజ్యోతిచిన్న దనదగునా ?
మరపుఘనము మిమ్ము స్మరించుమనసు
చిన్నదనదగునా ? అనదగదు .
కూడలసంగమదేవా || ౯౭ ||

82. చావు దప్పదని భయపడనెల ?
నాస్తికవాదియని సిగ్గుపడనెల ?
ఎవరైతెనేమి శ్రీమహదేవునకు శరణుడు
ఏమియెరుగనట్లుగా మౌనముతో నుండనేల ?
కూడలిసంగమదేవుని యెదుట
సాగిలబడి మొక్కుమా ? || ౯౮ ||

83. మురికినీరు తా ముద్దుగుండిననేమి ?
సరిపడని ధనము మరెక్కడనుండిననెమి ?
ఆకాశపుమామిడి ఫలమనిననేమి ?
త్రెంచనేల ? తిననెల ?
కూడలసంగమ శరణుల అనుభవములేనివారు
ఎక్కడుండిననేమి ? యెట్లైననేమి || ౧౦౦ ||

84. లోనకపటము వెలుపల వినయముండిన
భక్తులమనిపించుకొనేడు భక్తుల
మెచ్చదు మెచ్చదా లింగము
వారుసత్పథమునకు దగరు దగరయ్యా
లోవెలుపల ఒకటిగాని వారిని
నిరాశజూపి దూరగించునయ్యా వారిని
జగదీశు కూడలసంగమదేవుడు || ౧౦౦ ||

85. అర్ధరేఖయుండిన ఫలమేమి ?
ఆయుష్యరేఖలేనిదే ?
పందిచేత చంద్రాయుధముండిన
ఫలమేమి ?
గ్రుడ్డివాణిచేత దర్పణముండిన
ఫలమేమి ?
మర్కటము చేతమాణిక్యముండిన
ఫలమేమి ?
మా కూడలసంగమ శరణుల నెరుగని
వారిచేత
లింగముండిన ఫలమేమి
శివపథము నెరుగమి ? || 102 ||

86. పుట్టను గొట్టిన పాము జచ్చునటయ్యా!
అఘోరతపమునాచరించిననేమి ?
అంతరంగమునందాత్మశుద్ధిలేని వారిని
యెట్లు నమ్మునటయ్యా ?
కూడలసంగమదేవుడు || ౧౦౩ ||

87. కామమేల లింగప్రేమయున్నవాడికి ?
క్రోధమేల శరణవేద్యుడైనవాడికి ?
లోభమేల భక్తిలాభమును గోరువాడికి ?
మోహమేల ప్రసాదవేద్యుడైన వాడికి ?
మదమత్సరములున్నవాడికి హృదయశుద్ధి యెక్కడుంది ?
అనురాగముండిన
మా కూడలసంగమదేవుడుమెచ్చడు ||౧౦౪||

88. ఏతముతలవంచిననేమి ?
గురుభక్తుడగునా ?
సమ్మెట కేలుమోడ్చిననేమి ?
భృత్యాచారియగునా ?
చిలుక జదివినఫలమేమి ?
లింగతత్వమునెరుగునా ?
కూడల సంగన శరణుల
రాకను నిల్చిన నెలవును
కామవికారులెట్లు గుర్తింతురయ్యా? ||౧౦౪||

89. దొంగలింపకుము హింసింపకుము
అసత్యమాడబోకుము
కోపింపకుము అన్యులనుగాంచి
అసహ్యించుకొనకుము
తననువర్ణించుకొనకుము
ఎదుటి వారిని దూల నాడకుము
ఇదియే మాకూడల సంగమ దేవుని
ప్రసన్నునిగాజేయు విధము ||౧౦౬||

90. ఎలుక పంజరముననున్నరీతి
నా సంసారము
తనువును జెరపక మానదు
ఇతరుల వేధించును
మనసును జెరపకమానదు
పరుల నిందించును
అకటకటాసంసారమునకు వేసారితిని
(వృథాబోయెనుగదా?)
కూడలసంగమదేవా ||౧౦౭||

91. శూలము పైని భోగము
ఎట్లుండిననేమి ?
నానావర్ణపు సంసారము
పాములనాడించు
పాములవాడినేస్తము పగిది
తనఆత్మతనకు బగయైనపిదప
వేరుగతి గలదా ? మహాప్రభో
కూడలసంగమదేవా || ౧౦౮ ||

92. పుట్టుక కుదల్లియై
పుట్టించెనుమాయ
మోహమునకు గూతురై
పుట్టించె మాయ
కూడుటకు స్త్రీయై
కూడెను మాయ
ఇన్నిరకాలతో నన్ను
వేధించెను మాయ
ఇట్టిమాయను దొలగించుటకు నావల్లగానిపనియని
నీవేఉంగుదువు కూడలసంగమదేవా || ౧౦౯ ||

93. నా చిత్తము మేడి పండు వంటిదయ్యా ?
విచారించిన నేమియు సారము లేదయ్యా ?
ఈ ప్రపంచపు ఆడంబరమున
నా యొక్క విగ్రహము గావించితిరయ్యా ?
కూడలసంగమదేవా || ౧౧౦ ||

94. కొమ్మమీది కోతివలె
నిల్చున్నచోటనిలువ నీయదు నామనసు

కూడలసంగమదేవా
మీ పాదపద్మమునందు
భ్రమరముగానుంచుట మీ ధర్మము || ౧౧౨ ||

95. ఆశయామిషతామసముసటి
విషయము కుటిలము కుతంత్రము
క్రోధము, క్షుల్లకము అసత్యము
వీటినెల్లనా నాలుకపై నుండి దీసివైచి
శుభ్రపరచుమయ్యా, ఏలననగా
మీ వైపునన్ను రానీయవు అందుచేత
వీటన్నింటిని దొలగించినన్ను
పంచాచార్యుల భక్తుడిగా జేయుమా!
కూడలసంగమదేవా || ౧౧౨ ||

96. గ్రామచీరలకై చాకలికలత జెందునట్లుగా
ధనమునాది, భార్యనాది, భూమినాదియని
భ్రాంతిజెందితిని, మిమ్ముదెలయనికత
మున బలుచెడితిని, కూడలసంగమదేవా || ౧౧౩ ||

97. కనకమను శునకమునకు మెచ్చి
మిమ్మునేను మరచితినయ్యా!
కాంచనమునకై కాలముగరుపితిని
కాని లింగార్చనకుగాలములేదయ్యేను
ఎముకలకు మరగిన శునకము
అమృతరుచినియెరుంగునా || ౧౧౪ ||

98. నరపతివిచారము సంపద శృంగారము
స్థిరముగాదు మానవుడా! చెడెను
కల్యాణము పాడయ్యేను చూడుమా!

ఒక్కజంగమూభిమానముచేత
బాహుక్ష్మగొంబుగుయొక్క ప్రలుబడినటింపెను
సమకూరెను కూడలసంగమదేవా!
మా కవలలకు ॥ ౧౧౫ ॥

99. సుఖదుఃఖములు సమానములు
సుఖమొచ్చిన పుణ్యఫలమనను
దుఃఖమొచ్చిన పాపపుఫలమనను,
నీవనుగ్రహించితివందును
కర్మకు కర్తనే చివరయనెదను
ఉదాసీనుడనై శరణు అనను
కూడలసంగమదేవా
నీవొనర్చిన ఉపదేశము నాకీరీతిగా
పరిణమిచెను సంసార సుఖమును
అనుభవిచెదను ॥ ౧౧౬ ॥

100. కాయకష్టమునకు భయపడి
కాపాడుమనివేడను
బ్రతుకుదెరువునకు భయపడి
అనుగ్రహించుమని వేడను
"యద్భావంతద్భవతి"
ధనమురాని, దారిద్ర్యమురాని
వలయు వలదననయ్యా!
నేనుమిమ్ము గోరను మానవులనర్థించను
ఆనమీయాన కూడలసంగమదేవా ॥ ౧౧౭ ॥

101. రేపురానున్నది మాకు నేడే రానిండు
నేడు రానున్నది మాకిపుడేరానిండు

ఇందుకుజంకువారెవరు?
జడియువారెవరు ?
''జాతస్యమరణం ధృవం''
అనునట్లుగా || ౧౧౧ ||

102. (సహవాసము)
మట్టిపాత్రలు జేయుటకు
మట్టిమొదలు
నగలు జేయటకు
స్వర్ణమే మొదలు
శివపథము దెలియవలెననిన
గురుపథమే మొదలు
కూడలసంగమ దేవుని దెలియవలెననిన
శరణుల సాంగత్యమే మొదలు || ౧౨౦ ||

103. సారసజ్జనుల సంగము జేయుట
దూరుదర్జనుల సంగము జేయవలదయ్యా
ఏపాము్మైననేమి ? విషమొకటే
అట్టివారి సాంగత్యము వలదయ్యా!
అంతరంగము శుద్ధము లేనివారి సంగమము
భయంకరమగు కాలకూటవిషము
కూడలసంగమదేవా || ౧౨౧ ||

104. సారసజ్జనుల సంగము మంచిదయ్యా!
దూరదుర్జనుల సంగము భంగమయ్యా!
సంగము రెండు విధములుండును
అందొకటి బట్టుట మరొకటి వదలుట
మంగళమూర్తి మా కూడలసంగమ శరణుల || ౧౨౩ ||

105. దూషకుడొకడు దేశము నొసంగిన
ఆశతో వాడి చేరువనుండకుము
మాదిగ శివభక్తుడైనచో
నాతని చేరువనుంటమంచిదయ్యా
భృత్యుడైయుంట మంచిదయ్యా
దాసుడై యుంట మరి మంచిదయ్యా
కూడుకొనియుంట మా కూడల సంగన శరణుల || ౧౦౫ ||

106. కంటియెదుట నున్నమహాశివయోగిని జూచి
కన్నులార శరణార్థియనిన
యేడు జన్మల పాపము దొలగిపోవును
పాదమునుముట్టి నమస్కరించినచో
శరీరము పునీతమగును
పరషమును దాకిన పగిది
కర్తకూడల సంగమ శరణుల సంగము
మరల భవములకురానీదు చూడుమా || ౧౦౬ ||

107. ఎవరెవరిసాంగత్యమేమేమి జేయదయ్యా
కీటకమేఘుట సర్పము గాదటయ్యా!
చందనవృక్షము ప్రక్కనున్న
వేప తుమ్మ వృక్షములు సుగంధితములగునయ్యా
మా కూడలసంగమ శరణుల సంగమున
శరణుల సంసర్గము వలన చేసిన
కర్మము నిర్మలమగునయ్యా || ౧౦౭ ||

108. పాము వంకర పుట్టకు పసందు
నదివక్రత సముద్రమునకు పసందు
కూడలసంగమ శరణుల
వక్రత లింగమునకు (పసందు) || ౧౦౮ ||

109. పర్వతముపైన పలు వృక్షములుండినను
శ్రీ గంధము వృక్షము సమీపమున్నవి పరిమ
ళముతో నుండవా ? చూడాలి భరితములుగానా ?
లింగవంతుని చెంతనన్న వెనుకటి
దుస్సాంగత్యము సమిసిపోవును
కూడలసంగమదేవయ్యా
సిరియాళుని జేరిన నరులంతా సురులుగాలేదా! || ౧౨౯ ||

110. ఒక మాటకు తొమ్మిది మాటలాడి
కనులెఱ్ఱగజేసి కనుబొమలు ముడివడ
వారిని జూచిన భయపడుదును
బరులుతనను భంగపాటు జలిపినను జరుగనిమ్ము
కూడలసంగన శరణుల
అనుభవములేని వారినిజూచిన
పొలిమేరలదాటి పారిపోవుదును || ౧౩౦ ||

111. వేపవిత్తును విత్తి బెల్లపు అరుగును గట్టి
ఆవుపాలను బోసితేనేమినా
తీపిగా మారునా! చేదుగాక
శివభక్తులుగాని వారితో
ముచ్చటించందగదు కూడలసంగమదేవా || ౧౩౨ ||

112. సింహమునడుము విరిగిననా సింహమునకే
టియందము? తొండము దెగిన గజమునకేటి
యందము? రణరంగమున వీరుడోడిన అదేటి శోభ
అందమునకు ముక్కులేమియదేటి యందము?
నిజముగా నిండిన భక్తి ఉప్పొంగని వారి సాంగత్య
మేమియందము ? కూడలసంగమదేవా || ౧౩౩ ||

113. దాసితనమెడలో ఇత్తడి యాభరణములతో నలంక
రించినట్లు, కుచ్చితుల సాంగత్యము సజ్జనాళికి భంగము
గురివింద గింజ మాణిక్యమునకు సాటియగునా ?
కూడలసంగమదేవా || ౧౩౪ ||

114. సంసారబాధ వీడదు మనసు సంశయంబునుమానదు
మొదట లింగమును జూచితిననుట కల్లసుమా!
దహించిన కరణాదులు ఒకే మార్గమును గుర్తించవు
ఎట్లు శివపథము నాకు సాధ్యపడునయ్యా!
నా తండ్రి కూడలసంగమదేవా
మీ శరణుల చెంతనుండిన
నా బాధ తోలగి పోవును || ౧౩౫ ||

115. వృక్షముల ఘర్షణ వలన
అగ్ని బుట్టి ఆ వృక్షములను గాల్చకమానునా ?
అందుచేతమహాను భావులను జూపుమా!
కూడలసంగమదేవా

116. జ్ఞాన బలిమి వలన అజ్ఞానము జెడును
జ్యోతి బలిమి వలన కాఱుచీకటి దొలగు సుమా
పరషము బలిమి వలన లోహవికారముదొలగును సుమా
కూడలసంగమ శరణుల అనుభావము వలన
నా మలిన మనసు శుద్ధమగును సుమా! || ౧౩౬ ||

117. మీ శ్రీ పాదమును ముట్టినా కర్మమునశించెను
మీ ప్రసాదము చేతనేను భవమును గెల్చితిని
చూడుమా ? మనసు పరుషము, దృష్టిపరుష
ముచూడుమా! భావపరుషము చూడుమా!

లింగగుణములు కూడలసంగమదేవా
మీ శరణుల అనుభావము వలన
నేను సుఖించితిని || ౧౩౮ ||

118. ఆచారమరయుడు విచారమరయుడు
జంగమ స్థలమే లింగస్థలము చూడుమా!
జాతి భేదము లేదు, సూతకము లేదు
పుట్టుకలేని వాడికి కులములేదు
నుడివినట్లు నడువమి, కూడల సంగయ్య
మెచ్చడు చూడుమా ! || ౧౩౯ ||

119. ఎత్తుకొననేల మరల దింపనేల
ఎనలేని భక్తి జేయనేల
నిందింపనేల స్తుతింపనేల ?
ముందుకు దొనిచ్చి జంగమమును
నిందించువారినోట మట్టిని బోయకుండునా ?
మా కూడలసంగమదేవుడు || ౧౪౦ ||

120. చెట్టుకు వాయి ( ముఖము) వేరని
దిగువ నీరు బోసిన
పైనపల్లవించెను చూడుమా ?
లింగ ముఖము జంగమంబని దెలసి
పడి పదార్థములనర్పించిన
ముమ్ముందు సమస్తవస్తువుల నొసంగును
అట్టి జంగమును హరుడని భావించి
నరునిగా భావించిన నరకము దప్పదు సుమా
కూడలసంగమదేవా || ౧౪౧ ||

121. నేనారంభింతునయ్యా గురుపూజకని
నేను వ్యవహరింతునయ్యా లింగార్చనకని
నేను గురుసేవయోనర్తునయ్యా
జంగమ దాసోహమునకని
నేనే కర్మములను జేసినను
ఆకర్మ ఫలభోగమును
నీవే కరుణింతువని నేనెరుగుదును
నీవనుగ్రహించిన ద్రవ్యమును మీకుగాక
మరొకదానికివెచ్చించను
మీ సొమ్మును మీకర్పింతును
కూడలసంగమదేవా || ౧౪౨ ||

122. సందేహమెందులకయ్యా! సంసారమున
దినదినము ప్రతిదినము అర్చన పూజలుజే
యుట, కూడల సంగమదేవుని గూడుట || ౧౪౩ ||

123. నాడు నేడు మరొకనాడుయనబోకు
ఈ దినమె శివశరణను వాడికి
ఈ దినమే హరశరణను వాడికి
ఈ దినమే మాకూడల సంగమ దేవుని
నేమరక ధ్యానించువాడికి శుభము || ౧౪౪ ||

124. తొత్తునకేల లక్షణము ?
దాసునకేల ఆచారము
ఆగమశాస్త్రమెందుకుడింగరికి
మిగిలినదానిని మ్రింగువాడికి
కూడలసంగమదేవా
మిమ్ము విశ్వసించుటేనాకు ఆచారమయ్యా! || ౧౪౫ ||

125. నీటగ్రుంకులిడు అన్నలారా!
వదలండోయ్ వదలండు
పరధనమాశ వదలండు
వీటియాశ వదలనిదేయేటగ్రుంకిన
వృథా ప్రయాసమే, కూడలసంగమదేవా ॥ ౧౪౬ ॥

126. లింగ జంగము లొకటేయని నమ్మినబిదప
వారియంగనులు లింగము రాణివాసము
అక్కడ కలియుట ఇక్కడ కలియుట
చౌడేశ్వరునియందును కలయిక
స్తన్యపానము జేయువారి భావము
వికృతమైనచో శిరచ్ఛేదముగావించును
మా కూడలసంగమదేవుడు ॥ ౧౪౭ ॥

127. చూడదగదు నుడువదగదు
పరస్త్రీ సంగమము వలదు వలదు చూడుమా!
మేకను వెంబడించు శునకమువలె
వలదుచూడుమా!
ఒకకోటిక వేయి వత్సరములు
నరకముననుంచునుసుమా
కూడలసంగమదేవుడు ॥ ౧౪౮ ॥

128. కులమునడుగవలదు
పరుషము ముట్టిన పిదప ఇనుముగానేరదు
లింగము, ముట్టిన బిదప దురాచారముండదు
కూడల సంగన శరణులు అన్యము నెరుగరు.

129. పట్టాభిషిక్తునిగావించిన బిదప
లక్షణమునుగురించి విచారించనేల?

లింగదేవునకర్పించి కులము నడుగదగునా ?
అయ్యా! కూడలసంగమదేవ భక్తుని
దేహమే నాదేహమని భావించితిరి || ೧೨೧ ||

130. కులమదమునకై పోరుసల్పి
జంగమును వేరు గాదలచెదను
ఫలమేమి నిత్యలింగార్చన ప్రాయశ్చిత్తము
ఛల మదమునకై బోరాడి
లింగభేదమొనర్చెదను
ఆలమంద నుగాచెపశువుల కాపరి
వలె, పలుపశువులనాడించుపగిది
తనువుభక్తుడయ్యెను గాని
మనసు భవియయ్యెను
కూడలసంగమదేవా || ೧೨೨ ||

131. లింగమునందు పరుషత్వముండునా ?
జంగమునకు గులముండునా ?
ప్రసాదమునందరుచియుండునా ?
ఈ మూడింటిలో భేదభావమునువెదుకుదును
కూడలసంగమదేవా! జలధార పగిది నాభక్తి || ೧೨೩ ||

132. అప్పడోహరకక్కయ్య - తాత చన్నయ్య, ఐన
నేను బ్రదుకనా! మళ్ళియాశ్వపచయ్య
సామీ ప్యమువలన భక్తియను సద్గుణము
నేగుర్తించితినయ్యా! కష్టజాతి జన్మమునందు
జన్మించితిని, నాకిది విధియా!
కూడలసంగమదేవా || ೧೨೪ ||

133. ఉత్తమ కులంబున బుట్టితినని
కష్టతనమను భారమును మోపకయ్యా
కక్కయ్య ప్రసాదమిడడు చూడుమా!
దాసయ్య మజ్జిగ బోయడు చూడుమా!
మన్ననపు చెన్నయ్య నన్నుమన్నింపడు
ఉన్నత మహిమగల కూడలసంగమదేవా
శివధోశివధో || ౧౩౩ ||

134. శెట్టియందునా ? శిరియాళుని
చాకలి అందునా? మాచయ్యను
డక్కలి యందునా ? కకయ్యను
మాదిగయందునా చన్నయ్యను ?
నేను ద్విజుడనినచో కూడల సంగయ్య
నవ్వునయ్యా ! || ౧౩౪ ||

135. వ్యభిచారికి బుట్టిన శిశువువలె
ఎవరినైనను నేను నాయనానాయనా అనను
చెన్నయ్య పుత్రుడినినేను
చెన్నయ్య నా తండ్రి, కూడలసంగమదేవా
నిను మహోగృహమున ధర్మసంతానము
బండారి బసవన్న || ౧౩౫ ||

136. భక్తిలేని నిరుపేదను నేనయ్యా ?
కక్కయ్య ఇంటవేడితిని
దాసయ్య ఇంటవేడితిని
పురాతనులందరు గలిసి భక్తి భిక్షపెట్టగా నా
పాత్రనిండినది
కూడలసంగమదేవా || ౧౩౬ ||

137. పెద్దయ్య శ్వపచయ్య
చిన్నయ్య డోహరకక్కయ్య
అయ్యలకు పెద్దమా
మాదర చెన్నయ్య
కూడలసంగమదేవా
మా శరణులు ప్రసన్నులై
నన్ను రక్షించువారు || ౧౬౦ ||

138. నాకెవ్వరు లేరు, నాకెవ్వరు లేరందురు
బాణుని వాడిని నేను, మాయూరుని వాడిని నేను
కాళిదాసు వాడిని నేను
కక్కయ్య పెద్దయ్య చిన్నయ్య చెన్నయ్యలు
ఎత్తుకొని ముద్దాడిరక్షించిరి
కూడలసంగయ్యా || ౧౬౨ ||

139. దేవుడితో బాటు భక్తుడు మధ్యహ్నముకేతెం
చిన, ఉద్యోగమేలేదని పలికిన యెడల
మీ యానమీ పురాతను లాన
శివధో శివధో! కూడలసంగమదేవా
భక్తుని గులమునడిగినమీ
రాణివాసమాన || ౧౬౩ ||

140. నిమ్న జాతిలో బుట్టి గులమునడుగుదును
ఓరి! మాతంగి కుమారుడవునీవు
చచ్చిన బ్రాణినిదేసిపైచినవాడు అస్పృశ్యుడా!
తలపైగిడుకొనిదెచ్చిమీరు చంపుదురు
శాస్త్రమనుదానిని మేషమునకు విక్రయించి
వేదమనునది మీకుదెలియదు

మా కూడల సంగన శరణులు
కర్మమునకు దూరము శరణుల కుసన్నిహితులు
అనుపమ చరిత్రులు వారికి
సమానులైనవారు లేరుసుమా! ||౧౬౪||

141. వ్యాసుడుబోయ వనితకు బుత్రుడు
మార్కండేయుడు మాతంగి వనితకు బుత్రుడు
మండోదరి మండూకమునకు బుత్రిక
కులమునడుగ వలదు కులముతోమున్నేమైరి
సాక్షాత్తుగా నగస్త్యుడు కమ్మరి
దూర్వాసుడు సముగార కస్యపుడు కమ్మరి
కౌండిల్యుడనె ఋషిముల్లోకములెరుగు
నావికుడు జూడమా ?
మా కూడల సంగమ దేవుడి వచన మిట్లుండ
శ్వపచుడైననేమి ? శివభక్తుడే ఉత్తమ కులజుడు || ౧౬౫ ||

142. ఉత్తమ కుల జులనుటకేది దృష్టాంతము
శ్లో. సప్తధాతు సమంపిండం
సమయోని సముద్భవం।
అంత్యజాతిద్విజాతిర్వా
వర్ణానాంకింప్రయోజనం,
కాచికమ్మరియయ్యె
ఉదికి మడివేలుడయ్యె
నేసిసాలెవాడయ్యె
వేదము జదివి విప్రుడయ్యె
చెవియందు జనించిన నాగున్నారాలోకమున
అందుచేత కూడలసంగమదేవా
లింగస్థలమును గుర్తించిన వాడే కులజుడు || ౧౬౬ ||

## బసవ ప్రతిజ్ఞ :-

143. దేవదేవ నావిన్నపము చిత్తగింపుము
విప్రుడు మొదలుకొని శూద్రుని వరకు
శివ భక్తులైనవారి నందరిని ఒకేరీతిగా జూతును
విప్రుడు మొదలుగొని శూద్రుని వరకు
భవులైన వారినెల్లా ఒకే రీతిగా జూతును
ఇదియిట్లేయనినమ్మిన నామనసు
ఇట్లనుడివిన వాక్కులో తిల
మొన ప్రమాణము సందేహమున్నచో
పండ్లు జూపిముక్కుగోయుము
కూడలసంగమదేవా ॥ ౧౬౩ ॥

144. నేల ఒకటే అస్పృశులవాడకు శివాలయానికి
జలమొకటే శౌచాచమానములకు
కులమొకటే తనను దాదెల్సికొనువాడికి
ఫలమొకటే షడుదర్శన ముక్తికి
నిలవు ఒకటే కూడలసంగమదేవా
మిమ్ము నమ్మి వాడికి ॥ ౧౬౮ ॥

145. పండుగకు దెచ్చిన మొక్కుబడిగొఱ్ఱె
తోరణమునకు దెచ్చిన మామిడాకులదినెను
తనను చంపుదురనునది దెలియక
ఆకొన్న దేహమును సహించనిదే
అక్కడక్కడే బుట్టి అక్కడక్కడే మరణించును
అట్లు దానిని జంపిన వారుందురా ?
కూడలసంగమదేవా ॥ ౧౭౧ ॥

## అహింసా వ్రతము :-

146. దయలేని ధర్మమెట్టిదయ్యా?
దయయుండవలెను సమస్త ప్రాణులయందు
దయయే ధర్మమునకు మూలమయ్యా!
కూడల సంగయ్యనట్లుండమినమ్మడయ్యా! || ౧౭౨ |

147. తనువును బాధించి మనసును కలత పరచి
మీ పాదమును బట్టిన వారున్నారా ?
ఈనుడిదహింప జేయదా ?
కూడలసంగమదేవా
శివభక్తుల బాధే అది లింగము బాధ || ౧౭౩ ||

148. చంపనయ్యా! ప్రాణులను
తిననయ్యా! నాలుకరుచికై
ఒల్లనయ్యా! పరస్త్రీల సాంగత్యము
గుర్తింతునయ్యా! ముందుముప్పున్నదని
కంచము ముఖము వలె ఒకే మనసు గా మార్చి
నిల్చుండుమని నిలుపవయ్యా!
కూడలసంగమదేవా || ౧౭౪ ||

## కలసి భుజించవలెను

149. ఇచ్చిన దానినిగైకొనుటేనేమము
ఉన్నదానిని లేదని చెప్పకుండుటే నేమము
వంచనజేయకుండుటే అదినేమము
నడచి తప్పకుండుటే నేమము
మా కూడల సంగన శరణులు విచ్చేసిన
స్వామికీవస్తువు నప్పగించుటే నేమము || ౧౭౫ ||

150. కాకిఒక మెతుకును జూచిన
అరచి బిలుచును తన బళగమునంతటిని
కోడిఒక వస్తువును జూచిన
అరచి బిలువదాతన కులము నంతను
శివభక్తులై భక్తి పక్షములేనిచో
కాకికోడికంటెను కనిష్టము గదా! ఓ!
కూడల సంగమదేవా || ೧೭೮ ||

151. దేవలోకము మర్త్యలోకమనునది
వెరోఒకటి ఉందా ?
ఈ లోకమునందే మరియననంతలోకము ?
శివలోకమే శివాచారమయ్యా ?
భక్తుడున్న స్థలమే దేవలోకము
భక్తుని ప్రాంగణమే వారణాసి
కాయకమేకైలాసము
ఇది సత్యము కూడలసంగమదేవా || ೧೭೮ ||

152. మర్త్యలోకమనునది
కర్తయొక్కటంకసాలవంటిదయ్యా ?
ఇక్కడగౌరవింప బడినవారు
అక్కడను గౌరవింప బడుదురయ్యా ?
ఇక్కడ చెల్లని వారు అక్కడను చెల్లరయ్యా ?
కూడలసంగమదేవా || ೧೭೯ ||

153. దేవలోకము మర్త్యలోకమనునది
వేరేలేదు సుమా!
సత్యమును బలుకుటే దేవలోకము
మిథ్యమును బలుకుటేమర్త్యలోకము

ఆచారమే స్వర్గము
అనాచారమే నరకము
కూడల సంగమదేవ ఇందుకు
నీవే ప్రమాణము || ౧౮౦ ||

154. పుణ్యపాపమునునవి, తమఇష్టము సుమా?
అయ్యా అని అనగాస్వర్గము
ఓరి యనగా నరకము
దేవా ! భక్తుడు జయజీయా!
అనునుడిలోనేకైలాసమున్నది
కూడలసంగమదేవా || ౧౮౦ ||

155. ఆత్మస్తుతి పరనిందలను వినిపింపకు
మయ్యా! మీ ధర్మము
నేను భక్తుడిని నాలో మంచి గుణముందని
పరిణమింప జేసిన మీకునేను
ద్రోహినయ్యా! కూడలసంగమదేవా
మీ శివశరుణుల హితమేనాహితమయ్యా || ౧౭౨ ||

156. ఆచరించుటెరుగనునుడువుటెరుగను
లింగమును బూజించిన ఫలమేమి ?
వారిసుఖమేనాసుఖము
వారిదుఃఖమేనాదుఃఖము
కూడలసంగమ శరణులమనసు
కలతజెందిన నేను బాధితుడనయ్యా || ౧౭౩ ||

157. ఉదయ కాలమున నిద్దుర లేచికన్నులనులుముతు
నాయొడలికి నాభార్య బిడ్డలకని
చింతించినచో నా మనసునకుమనసే సాక్షి

శ్లో॥ ఆశనేశయనేయానె
సంపర్కేసహభోజనె।
సంచరంతిమహాఘోరె
నరకేకాలమక్షయం॥
అనువేదసూక్తిని బసవణ్ణ పలించును
అందురు, భవబిజ్జళుని సింహాసనము
దిగువగూర్చుండి యానందింతునందురయ్యా!
ప్రమథులు. ఇచ్చెదను
సమాధానమును వారికి ఒకేసారి
అస్పృశ్యుల ఇంటప్రవేశించియైనను
కైగూలిజేసియైనను, మీ కై జింతింతునుగాని
నాయుదరపోషణమునకు జింతించిన
శిక్షార్హుడను, కూడలసంగమదేవా ॥ ౧౫౭ ॥

158. పరులమేలును జూచి మనసు ఆశించిన
ఫలము శూన్యము సుమా!
తాటి ఫలముకైకరము జాపి
పైకి తలెత్తి జూచిన గొంతు నొప్పిడునయ్య
కూడల సంగమ దేవ అవధరింపుమయ్యా!
నీపైయనుగ్రహించనిదేదియు లభింపదయ్యా ॥ ౧౫౮ ॥

59. తొల్లిజేసిన పాపము వెన్నంటి యుండగ
ఇంకను గోరిన వచ్చునా!
భక్తి గల్గియున్నవారిని పలుమారుజూచి గోరద
గునా? కూడలసంగమదేవుడిచేత
తొల్లివరమును బడియకున్న ॥ ౧౫౯ ॥

160. చంద్రోదయమునకు సముద్రము పెరుగునటయ్యా!
చంద్రుక్రుంగిన అదిక్రుంగునటయ్యా!
చంద్రునికి రాహువు అడ్డుపడినప్పడు
సముద్రము పెడబొబ్బబెట్టెనా ?
సముద్రమును అగస్త్యుడా పోషణముగావించినపుడు
చంద్రుడడ్డగించెనా ? అయ్యా!
ఎవరికి యెవరును లేరు చెడిన వాడికి గళయుండదు
లోకబంధువు నీవెగదయ్యా!
కూడలసంగమదేవా || ౧౨౭ ||

161. పాయిమంటలెగసి, నిలబడవచ్చును,
ధరపైమంటలెగసిన, నిలబడవచ్చునా ?
సముద్రము ముంచెత్తగా? కంచెచేనుమేయగా ?
నారితసఇంట్లో దొంగలించినా!
తల్లిపాలు విషమై శిశువు ప్రాణము గొన్న
ఇంకనెవరికి మొరబెట్టుకొందునో
కూడలసంగమదేవా || ౧౨౮ ||

162. సూర్య చంద్రులు ఉదయించి అస్తమింతురయ్యా
౧౨౪ || బ్రహ్మప్రళయమునకులోనయ్యె
హరిసింహాసనముమరుగయ్యె
రోమజులనువారు చెట్టుదిగువనుండిరి
మార్కండేయమహాముని
స్వేచ్ఛామరణుడనిపించుకొనెను
లింగముయొక్క వాస్తవమెరుగడు
ఇందువలన
కూడలసంగమదేవా
నీహానర్చననింగి భక్షించెను అనేక పెద్దలను || ౧౨౯ ||

# పురాతనుల వాక్యమే మార్గదర్శకము

163. అద్యు లవాక్యము పరుషము వంటి
దయ్యా, సదాశివుడనే లింగమునా ధారముగా నమ్ముట
నమ్ముటతోడ నేనీకు విజయము
చేకూరునటయ్యా! అధరమునకుచేదు
ఉదరమునకు తీపి వంటిదయ్యా! కూడల సంగన
శరణుల వాక్యము వేమురుచి జూచినట్లగునటయ్యా
కూడలసంగమదేవా ॥ ౧౬౦ ॥

164. పాలప్రవాహమునకు బెలపుబురద
చక్కెర ఇసుక సముద్రపు అలలైయుండ
ఆద్యుల వాక్యములట్లుండగా
వేరెబావిని ద్రవ్వి ఉప్పు నీటిని ద్రావువాడిలా
అయ్యోనామతి, కూడలసంగమదేవా ॥ ౧౬౧ ॥

165. అర్జుని పదునైనఅమ్ములదాకిడికి మెచ్చి బ్రసన్నుడవైతివి
కాముని దహింప జేసితివయ్యా!
రేయి పగలనక పేటాడుకిరాతుని
గైలాసమునకు దీసికెళ్ళితివి
నన్నెందులకు గరుణించవైతివి ఓ
కూడలసంగమదేవా ॥ ౧౬౨ ॥

166. నీవు ప్రసన్నుడవైనచో యెండిన చెట్టు చిగుర్చునయ్యా!
నీవు ప్రసన్నుడవైన గొడ్డుపాలిచ్చు
నయ్యా! నీవు ప్రసన్నుడవైన విషమమృతమగునయ్యా!
నీవు ప్రసన్నుడవైన సమస్త
వస్తువులు సమకూరునయ్యా! ॥ ౧౬౩ ॥

167. ఉత్తమ గుణమును వెదుకదగునా ?
కాకియందు, పరుషగుణమును
వెదుకదగునా! ఇనుము నందు!
మంచిగుణమును వెదుకదగునా ? గుణహీ
నుని యందు, చందనగుణ
మును వెదుకదగునా ? ప్రతి వృక్షము నందు
సర్వగుణ సంపన్నుడవైన లింగమా ! నీవు
నాలోనియవగుణముల వెదుకదగునా ?
కూడలసంగమదేవా || ౧౬౪ ||

168. శివుడనుగ్రహించిన పుడు సిరిసంపదలు వెన్నం
టివచ్చును, ప్రవహించునట్టి గొప్ప ప్రవాహముతో తటాక
ము నిండినట్లగును, దొరకని వస్తువు దొరకును
చూడుమా! రాజలీవి పరివారము దాసదాసీ
జనము పొగడ్తలు చూడుమా! పరమ నిరంజనుడు
మరచినపుడు, నిండుగడవకు రాయివిసరి
నట్లగును, కూడలసంగమదేవా || ౧౬౫ ||

169. పరుగిడువాడు సేవకుడుగాడు
యాచించు వాడు భక్తుడు గాడు
పరుగిడగూడదు సెవకుడు, వేడుకొనగూడదు భక్తుడు
కనుకనేను పరుగిడు వాడనుగాను,
యాచించువాడను గాను,
కూడలసంగమదేవా || ౧౬౬ ||

170. ఎటు జూచిన యచట చిత్తమాకర్షించిన
ఆనమీయాన మీ ప్రమథులాన
పరస్త్రీని మహాదేవియందును
కూడలసంగమదేవా || ౧౬౭ ||

171. పరుగిడుపామునకు భయపడను
మండే జ్వాలకు భయపడను
ఖడ్గధారకు భయపడను
ఒకదానికి భయపడెదను మరొకదానికి భయపడెదను
పరస్త్రీ పరధనమను వాటికి భయపడుదును
తొల్లి భయపడని రావణుని గతియేమయ్యెను
భయపడుదునయ్యా కూడలసంగమదేవా ॥ ౧౯౮ ॥

172. పేదవిప్రుడు ఎంతటి భక్తుడైనను
జంధ్యమును దాల్చుట మానడు!
పూలమాలనిర్మితుడెంతటి భక్తుడైనను
లింగభక్తుడెంతటి భక్తుడైనను
విగ్రహారాధనమానడు
కంచరియెంతటిభక్తుడైనను
కాళికాదేవినుపాసించుట మానడు
నేనెవరికి యధీనుడనుగాను
మీ శివశరణుల కధీనుడనయ్యా!
కూడలసంగమదేవా ॥ ౧౯౯ ॥

173. వీరవ్రతుడను భక్తుడనని బొగడుకొందురు విన
రండి, వీరుడైనచో వైరులు మెచ్చవలెను
వ్రతియైనచో నంగనలు మెచ్చ
వలెను, భక్తుడైనచోజంగము మెచ్చవలెను,
ఈ వాక్యమున దననుదీర్చిదిద్దుకొనినచో
వేడిన పదమును గరుణించును, మా
కూడలసంగమదేవుడు ॥ ౨౦౦ ॥

174. పట్టుదల ఉండవలె శివ శరణునకు
పరులవిత్తము వలదనియు.
పట్టుదల ఉండవలె శివశరణునకు
పరస్త్రీవలదనియు.
పట్టుదల ఉండవలె శివశరణునకు
పరదైవము వలదనియు.
లింగజంగమంబొకటేయనియు
పట్టుదల ఉండాలి శివశరణునకు
ప్రసాదమేదిటమ్మైనదనియు
పట్టుదలలేని వారిని మెచ్చుకొనడు
మా కూడలసంగమదేవుడు ॥ ౨౦౦ ॥

175. అర్థమునకు, బెడార్థమును జెప్పి
పెడబొబ్బలు బెట్టుగాక
పుట్టిన బిడ్డలను నవఖండములు జేయుగాక
ముట్టినస్త్రీని కన్నులముందు అభిమానముతో
చెరచుగాక, ఇట్లీ త్రివిధములు వెలువడని
ఇంకను నాదేహముపైకిరానిండు
పట్టుకొని ముక్కలు ముక్కలుగా జేయనిండు
శూలముపైకెక్కించని
ఒకదిక్కునకు గాక పదునొకండు దిశలకు
పడద్రోయనిగాక, మరలలింగారాధన
యొనర్తును, మరల జంగమారాధనయొన
ర్తును, ప్రసాదమునకు తప్పను, ఇంతటినాబాసను
కొంచెమైనను ఉల్లంఘించినచో నీవానాడె నానాసికమును
ఛేదించుము, కూడలసంగమదేవా ॥ ౨౦౧ ॥

176. మురికి గుంట నీరు ముద్దుగున్ననేమి ?
సార్థకముగాని ధనము మరియెక్కడున్ననెమి ?
ఆకాశమందలి మామిడి పండున్ననేమి ?
త్రెంచలేము తినలేము ? కూడల సంగన శరణుల అను
భవములేని వారు ఎక్కడున్ననేమి? ఎటులైననేమి ॥ ౧౨౦ ॥

★ లోనకుటిలము వెలుపల వినయము గలగి
భక్తులమనిపించుకొనువారిని లింగదేవుడం
గీకరింపడయ్యా! అట్టివారుసత్పథమునకు
దగరయ్య! లోనవెలుపల ఒకటిగాని వారికి
నిరాశజూపిదూరాన పారద్రోయునయ్యా!
జగదీశ కూడలసంగమదేవుడు ॥ ౨౦౧ ॥

★ చూచినదానికాకర్షింపదు నాచిత్తము
పలికి యసత్యము జేయదునా నాలుకను
కూడలసంగమదేవా
మీ శివశరణుల విధమిట్లుండునయ్యా ॥ ౨౦౩ ॥

177. పాములవాడు ముక్కిడి – తనచేతిలో పాము
పుత్రువివాహమునకు శకునము జూడగోరునట్టి
అపశకునముబల్కు చతురునిజూడుమా !
తనభార్యముక్కిడిది, తనజేతియందుపాము
తానుముక్కుడి, తననన్యముగదేలియక
అన్యులనిందించు మూర్ఖులనేమందును
కూడలసంగమదేవా ॥ ౨౦౪ ॥

178. శకునమందువు అపశకునమందువు
మీ వారు దుఃఖించుటకు నాడెందుకు వచ్చిరి
మీ వారు దుఃఖించుటకు నేడెందుకు వెళ్ళిరి ?

నీవు వెళ్ళుటకు – నీవు వచ్చుటకు
సూర్యోదయముగాక పూర్వమే
పూజించు మాలింగమును
కూడలసంగమదేవా || ౨౦౫ ||

179. పుట్టిన బిదప ఇచ్చిన భోగములను
తప్పించెదననినదప్పవు చూడుమా!
నాకింతెందుకు నా కింతెందుకు ?
నా కింతెందుకు? యని యనకుము,
''నాభోక్తా క్రియతేకర్మ''
అను శృతిదప్పదు కూడలసంగమదేవా || ౨౦౭ ||

180. ఆయుష్యముతీరనిదే మరణములేదు
బాసతప్పనిదేదారిద్ర్యము లేదు
భయపడనేలలోకముననిందించువారికి
భయపడనేల కూడలసంగమదేవా
మీ సేవకుడనైయుండి || ౨౦౮ ||

181. ఎన్నిబాధలకు నన్నుగురిజేసినను
నేను ధైర్యమును వీడనయ్యా
మేన ఎముకలు దేలి నరములు దెగినను
పేగులు బయటపడినను
నేను ధైర్యమును వీడనయ్యా
సిరము దెగినేల పైబడినను
నానాలుక కూడల సంగా శరణు శివ శరణు
అని అనుచుండునయ్యా || ౨౦౯ ||

182. శుష్కింపజేసినా దేహమును నీరసము గావించినను
బొందిలో ప్రాణముండువరకు మీ చరణమును

ధ్యానించుటను మాననయ్యా!
శివశరణనుట మానను మానను
కూడలసంగమదేవయ్యా
నా శవముపై కంచముంచి భుజించినను
నేను మానను మానను || ౨౧౨ ||

183. దాన్యమున కై జింతుంచు వాడను గాను
సమయమునకై యారాట పడువాడను గాను
విసుగెత్తి పరుగిడు వాడను గాను
చిత్తగించు మో కూడల సంగమ దేవా
''మరణమే మహోనవమి'' || ౨౧౩ ||

184. ఉదకమునకు గలువ పూవే అందము
సంద్రమునకు కెరటమే అందము
స్త్రీకి గుణమే అందము
ఆకాశమునకు జాబిల్లే అందము
మా కూడల సంగన శివ శరణుల
నుదుటికి భస్మమే అందము || ౨౧౪ ||

185. పాము నోటికప్ప ఆకొని
తనముందు ఎగిరే ఈగకైయఱ్ఱులు చాచినట్లు
పాసిలిక్షకులోనైన చోరుడు !
పాలు నేయి త్రాగి ఆమీదట ఎంతకాలము బ్రదుకును ?
అశాశ్వతమైన దేహమును మెచ్చి
దానిని మోసుకొని తిరుగాడు వారిని
కూడలసంగమదేవుడనుగ్రహింపడు సుమా || ౨౧౫ ||

186. స్వామిసేవకుల అనుబంధమునకు
సాక్ష్యమెట్టిదనిన, సత్యమునుడువుట,

నుడివినట్లు నడచుట, నుడివినట్లు నడువని,
గృహస్థుని విశ్వసింపడు
మా కూడలసంగమదేవుడు ॥ ౨౧౬ ॥

187. భక్తియను సుభాషితము యొక్క వాక్యమునే
నేనుచ్చరింతును
నడవడిలోనుడువుటను పూరింతును
పైన తూచెత్రాసుయనెడు కట్టడిమీ చేతిలో
ఒక యవబీజము మాత్రము గీత దాటినచో
నన్నునడినీట ముంచి నీవుపెళ్ళిపొమ్ము
కూడలసంగమదేవా ॥ ౨౧౭ ॥

188. న్యాయనిష్ఠురుడను దాక్షిణ్యపరుడిని నేను
గానయ్య, లోకవిరోధుడైనను శివశరణు
డేలికి భయపడడు, కూడల సంగమ దేవుడి
రాజతేజమునందుంట వలన ॥ ౨౧౮ ॥

189. నుడివినచో పలుకులు ముత్యాల సరములా
ఉండాలి! నుడివినచో మాణిక్యపు కాంతివలె
ఉండాలి! నుడివినచో లింగము మెచ్చి
ఔనౌనని యనవలెను, నుడివినట్లునడు
వమి, కూడలసంగమదేవుడెట్లు
ప్రసన్నుడగునయ్యా! ॥ ౨౨౦ ॥

## గుడ్డినమ్మకము వలదు :-

190. రాతిపామును జూచిన పాలుబోయుడం
దురు, నిజమైన పామును జూచిన చంపుచం
పుమందురు. భుజించె జంగముడొచ్చిన

పొమ్ముపొమ్మందురు, తినని లింగమునకు
బోనము బెట్టుమందురు.
మా కూడలసంగమ శరణులను
జూచి ఉదా సీనముతో నుండిన
రాయి దాకిన దిబ్బవలె నుందురయ్యా! ॥ ౨౨౦ ॥

191. భక్తియను భూమిపై
గురువను బీజమంకురించి
లింగమను పత్రము అయ్యెను
ఆ లింగమను పత్రముపై
ఆచారమను పువ్వుబూచెను
ఆచారమను పువ్వుపై కాయబుట్టెను
నిష్పత్తియను పండయ్యెను
కూడల సంగమ దేవుడుదనకు
గా వలయుననియెత్తి కొనెను ॥ ౨౨౨ ॥

192. తినికట్టుటకు మారిగాక
చంపరక్షింప మారికయగునా ?
తనకుమారుని యముడు గొనిపోవు వేళ
అదెక్కడికి బోయె మారికవ్వ
వీరు రక్షింతురా !
మా కూడలసంగమదేవుడు గాక
మరో దేవుడు లేడు సుమా! ॥ ౨౨౩ ॥

193. మట్టిపాత్ర దైవము చేట దైవము
వీథిలో నిరాయి దైవము, దువ్వెన దైవము
వింటి త్రాడు దైవము చూడుమా !

దేవుడు దేవుడని కాలు బెట్ట సందులేదు
దేవుడొక్కడే మా కూడలసంగమదేవుడు || ౨3౦ ||

194. బ్రాహ్మణుడే దైవమనినమ్ముట వలన
గౌతమమునికి గోవధ అయ్యెను ?
బ్రాహ్మణుడే దైవమని నమ్ముట వలన
బలికి బంధనమయ్యెను
బ్రాహ్మణుడే దైవమనినమ్ముట వలన
కర్ణుని కవచము బోయెను
బ్రాహ్మణుడే దైవమని నమ్ముట వలన
దక్షునకు గొఱ్ఱెతలవచ్చెను
బ్రాహ్మణుడే దైవమని నమ్ముటవలన
పరశురాముడు సముద్రమునకు గురియయ్యె
బ్రాహ్మణుడే దైవమని నమ్ముటవలన
నాగార్జునుని దలబోయెను ?
దేవా భక్తుడని నమ్ముటవలన
మా కూడలసంగమ శరణులు
కైలాసవాసులైరి || ౨3౨ ||

195. ఆది పురాణమును అసురులకమ్మి
వేద పురాణమును మేక (పోతు) నకమ్మి
రామ పురాణము రాక్షసులకమ్మి
భారత పురాణమును గోత్రమునకమ్మి
సకల పురాణ కర్మకు మొదలు
మీ పురాణమునకు సాటిరావు
కూడలసంగమదేవా || ౨33 ||

196. నీటినిజూచిన గ్రుంకులిడుదురయ్యా!
వృక్షమును జూచినఛాయనా శ్రయింతురయ్యా!
ఎండిన కొలను ఎండిన చెట్టును
ఆశించనివారు మిమ్మెట్లు గుర్తింతురయ్యా!
కూడలసంగమదేవా || ౨౩౪ ||

197. అగ్నిదైవమని హవిస్సునొసగె
ద్విజునియింట అగ్ని జ్వాలలాక్రమింప
మురికి నీరు వీథిలోనిధూళిని
జల్లి పెడబొబ్బలు బెట్టి జనులను బిలుతురయ్యా
కూడలసంగమదేవా
వందనమును మరచి నిందింతురయ్యా! || ౨౩౬ ||

198. దరిద్రుడు శ్రీమంతుని స్మరించిన శ్రీమంతుడగునా!
శ్రీమంతుడు దరిద్రుని స్మరించిన దరిద్రుడగునా!
తొల్లి పురాతనులను స్మరించి ధన్యుడ
నైతినను మాటల రంజకుల నేనెమనవలెను
కూడలసంగమదేవా || ౨౩౭ ||

199. దంతములూడక మొదలు
శరీరము వంగక మొదలు
పరాధీనుడవుగాక మొదలు
చేతకఱ్ఱను బట్టక మొదలు
వృద్ధాప్యము ముట్టక మొదలు
మృత్యువు ముట్టక మొదలు
పూజించు మా కూడలసంగమదేవుని || ౨౩౮ ||

200. నీటి బుడుగకులోహపు కట్టుకట్టిన
సురక్షితముగ నుంచుదుననుటకంటెను

మహాదాని కూడలసంగమ దేవుని
బూజించి బదుకుము
ఈ కాయము స్థిరమని నమ్మకుము ॥ ౨౩౯ ॥

201. పంజరముగాపాడునని
భయపడక అరచె ఓ చిలుక
ఎన్నటికి జావనని గుడిగట్టితివి గదా!
నీమనసునందు, మా యాపంజరము
నినుజంపగా నిన్ను బంధించిన పంజరము
గాపాడునా నిన్ను ? కూడలసంగమదేవా ॥ ౨౪౦ ॥

202. ఓరోరి మానవుడా! పేరాశవలదురా!
సాంద్రమైన వెన్నెల సంపదస్థిరమైన దిగాదు సుమా!
శాశ్వత పదవినియనుగ్రహించునట్టి
కూడలసంగమదేవుని మరువక బూజించుము ॥ ౨౪౧ ॥

203. తననాశ్రయించిన రతి సుఖమును తాజేయు భుక్తి
ఇతరుల చేత జేయింప, దగునా?
తన లింగమునకు జేయు నిత్యనేమమును
తాజేయదగునే గాని పెరవారి చేత జేయిం
చదగునా ? సుఖో పచారమునకై జేతురుగాని,
మిమ్మెట్లు గుర్తింతురయ్యా కూడలసంగమదేవా ॥ ౨౪౨ ॥

204. తినుకంచము వేరు గాదు
చూచెదర్పణము వేరుగాదు
భాండ భాజనములు రెండును ఒకటె
శుద్ధిజేసిన దర్పణమయ్యెను అయ్యా!
ఆత్మనెఱింగిన శరణుడయ్యెను, దాన్ని
మరచిన మానవుడగును

మరువకుండ పూజించుము
మా కూడలసంగమదేవుని || ౨౮౩ ||

205. (సంపాదనను దాచి పెట్ట గూడదు)
చేసి పెట్టి లింగమును బూజించితిమనువారు
మీ రందరాలకింపుడు
పాదరక్షలను గుడి వెలుపల విడిచి
గుడిలోకి వెళ్ళి దేవరకు
నమస్కరించువాడిలా
తనపాదరక్షల ధ్యానముగాక
దేవుడి ధ్యానము గాదు
అట్లే స్వార్జితధనము దాచకుము
అట్లు దాచినచో భవము తప్పక వచ్చును
కూడలసంగమ శరణుల కర్పించి తీరాలి || ౨౮౪ ||

206. దీర్ఘాయుష్యముంది ప్రళయం లేదని
ధనమార్జించి గూడబెట్టితిరి
ఆయుష్యము తీరిప్రళయమేవచ్చినచో
అర్థమును అనుభవించెవారుండరు
భూస్థాపితం జేయకుము
భూమిమ్రింగును గాని తిరిగి యిచ్చునా?
కన్నులతో జూచిమట్టిలో దాచి
అనుభవించక బోయితివి సుమా!
నీభార్యకుండనెంచినచో
నీ భార్య కృతకము వేరె
నీ దేహము చెడిన మరోవిటుని జేరకుండునా?
పరులకొసంగి బాధపడనేల ?

కూడలసంగమ శరణులకు వెను
వెంటనే సమర్పించుము || ౨౪౫ ||

207. ఇంటిని జూచిన నిరుపేద
మనసు జూచిన మరి గొప్పది
సర్వాంగసమృద్ధిగలవారు
విస్తరించుటకు వీలులేదు
వచ్చిన అతిథులు తాత్కాలికముగా నుండ
దగును ! కూడల సంగన శరణులు
సర్వ స్వతంత్రధీరుల || ౨౪౬ ||

208. ధనమున ఈషత్ మాత్రమున
చీరలోని ఒక సూత్రమును
అన్నములోనొక మెతుకను
నేటికి రేపటికి వలయుననిన
మీ యాన మీ పురాతనులాన
మీ శివశరణులకుగాక ఇతరులకు వ్యయపరచక
వేరొండెరు గను కూడలసంగమదేవా || ౨౪౭ ||

209. కోట్ల కొలది జపమొనర్చి
బాధజెందగనేలమనసా ?
కొంచెమైన గీతము ఒకటి
అనంత కోటి జపతుల్యము సుమా ?
జపమననేలమనసా ?
కూడల సంగన శరణుల జూచి
ఆడి పాడి బ్రదుకుమా మనసా || ౨౪౮ ||

210. మట్టిపాత్ర మరల మట్టిగా మారదు
క్రియ చెడి

వెన్న గరిగి నెయ్యిగా మారి మరల
వెన్నగామారదు క్రియచెడి
బంగారు మరలలోహము గాదు
క్రియచెడి
ముత్యము నీటిలోనే బుట్టినను క్రియచెడి
మరల నీరుగాదు
కూడల సంగమ శరణులై మరల
మానవుడు గాడు క్రియచెడి || ౨౧౦ ||

211. పాపిధనము ప్రాయశ్చిత్తమునకు గాక
సత్పాత్రమునకు జెల్లునా ?
శ్వానముపాలు శ్వాన శాబకమునకు
గాక పంచామృతమునకు జెందదయ్యా?
మా కూడల సంగన శరణులకు గాక
దానమొనర్చిన అర్థము వ్యర్థమయ్యా || ౨౧౧ ||

212. బలిచక్రవర్తి భూమి, కర్ణుని కవచము
ఖచరుని అస్థిపంజరము
శిభిచక్రవర్తి మాంసము
వృథాపోయెనుగదా!
శ్లో॥ శివభక్తి మతిక్రమ్య
యద్దానంచవిధీయతె
నిష్ఫలంచభవేద్దానం
శారవంనరకంప్రజేత్!!
ఇట్టులని కూడల సంగన శరణుల నెరుగక
కీర్తి వార్తకై జేసిన వాడి ధనము
వృథా పోయెను గదా! || ౨౧౨ ||

213. నేడు నాయింటికి ప్రమథులు విచ్చేయుదు
రని? గుడికి బచ్చతోరణమును గట్టి
షడు సమ్మార్జన మొనర్చిరంగ వల్లివేసి
ఉఘోచాంగుభళాయందును
జయజయధ్వనులొనర్తును
తాము దినగ మిగేలినదాని నిచ్చినన్ను
గాపాడు దురు మా కూడల సంగమ శరణులు ॥ ౨౧౩ ॥

214. అవగింజపై సాగరము ప్రవహించినట్లయ్యె
ను, ఆనందముతో తులతూగుదును
ఆనందముతో నాట్య మాడుదును
కూడల సంగన శరణులు విచ్చేసిన
ఉబ్బికొబ్బి సంతస ముతోనోలలా
డుదును ॥ ౨౧౪ ॥

215. మనసు మనసు లేకమ్మైనపుడు
తనువు గరగనిచో
స్పర్శచేత రోమాంచనము గలుగనిచో
దర్శించిన కంటినుండి బాష్పములు రాలనిచో
(కన్నీటి ధారలొలకనిచో)
ముచ్చటించినడగ్గుత్తికయేర్పడనిచో
కూడల సంగమ దేవుని యందలి భక్తికిది చిహ్నమా ?
నాలోనివేవియులేమికతమున
నేనుడాంబిక భక్తుడను జూడుమా ॥ ౨౧౫ ॥

216. పలుజన్మలకు బోనీక
''సోహం'' అని యనిపించక
''దాసోహం'' అనియనిపించవక

లింగ-జంగముల ప్రసాదమును జూపి
బ్రతికించుమయ్యా! కూడలసంగమదేవా ॥ ౨౬౦ ॥

217. మసిని ఎంత కాలముగడిగినను
తెల్లదగునా ?
కర్మస్థితి వెన్నువీడదు
అనంతకోటి సన్మానముల గావించిననేమి
నిమిషముదాసీనత చెరచెను
మిమ్ము నమ్మియునమ్మని
డాంబికుడను నేనయ్యా!
కూడలసంగమదేవా ॥ ౨౬౧ ॥

218. నువ్వులులేని గానుగనాడించిన
ఎద్దువలె నయ్యెను నా భక్తి
ఉప్పను నీటిలో గలిపి
ఆరగించినట్లయ్యెను నా భక్తి
కూడలసంగమదేవా!
నేనాచరించితిననుచిచ్చుచాలదా? ॥ ౨౬౨ ॥

219. అష్టవిధార్చన షోడశోపచారమును
గావించు గర్వమున గాల్చబడితినయ్యా!
లింగమనియెరుగనైతి జంగమంబనియెరు
గనైతిని, ప్రసాదంబని యెరుగనైతిని
నేను దహించబడితినయ్యా ?
కూడలసంగమదేవా!
నేను జేయునదంతయు ఉపచారమయ్యా ॥ ౨౬౩ ॥

220. మా వారు పొగడి పొగడి బంగారు
శూలమున నుంచిరయ్యా!

నా పొగడ్తనన్ను దురభిమానిగమార్చె
నయ్యా! అకటా! మీరొనర్చిన గర్వము
వాడిదేలిన ఖడ్గమైదాకెను గదా!
అక్కటా! బాధకులోనైతిని భరిం
చలారెను కూడలసంగమదేవా!
నా మేలునపేక్షించువాడవైతె
నా పోగడ్తకు అడ్డురమ్మా ధర్మ || ౨౽౪ ||

221. వెలుపల బూసి (మెరుగు బెట్టిన) న లాభమేమిటయ్యా?
లోపల శుచిత్వములేనిదే ?
హారము వేసి లాభమేమిటయ్యా ?
మనసు లేనిదే నూరు బలించ్చిన లాభమేమిటయ్యా ?
మా కూడల సంగమ దేవుని మనసారస్మరించనిదే || ౨౽౫ ||

222. గజమునధిరోహించివెళ్ళితిరా మీరు ?
అశ్వమునధిరోహించి వెళ్ళితిరా మీరు ?
కుంకుమ కస్తూరిని బూసికొని వెళ్ళితిరా మీరు ?
సత్య స్వరూపము నెరుగనిదే వెళ్ళితిరి గదా!
సద్గుణమను విత్తును నాటి పెంచకయే వెళ్ళితిరి గదా!
అహంకారమను మదగజము నెక్కి
విధికి బలియై మీరు వెళ్ళితిరి గదా!
మా కూడల సంగమ దేవునెరుగక
నరకమునకు లోనైతిరి గదా! || ౨౽౬ ||

223. (పెద్దలతో సరసమాడకూడదు)
మాటిమాటికి దేవరాన
మాటిమాటికి గురువు అన
అనువచనము నే అంగీకరింపడు

ముమ్ముందు శివపథమునకు దగరు
ఆదినుండి వచ్చిన వచనమని
శివశరణులతో సరసమాడినచో
నవ్వుతు గ్రుచ్చికొనిన ఛురికత్తి
గాయపరచకుండునా ?
కూడలసంగమదేవా || ౨౯౩ ||

224. పాము పడగలతో చంపకురాపిడిజేసిన
కొరవితో తలను గోకుకున్నరీతిగా
పులిమీసములతోనుయ్యాల ఊగినట్లుగా
కూడల సంగమ శరణులతో
మరచి సరసమాడిన
సున్నపురాళ్ళను ఉడిలోబెట్టుకొని
మడుగులో బడినట్లగును సుమా! || ౨౯౪ ||

225. కొలివిని తలసిగలో నుంచినగాలకుండునా ?
రాతి గుగ్గిళ్ళను నమలినదంతభగ్న
ములుగాకయుండునా ?
శరణులతో సరసమాడిన
నకరము దప్పదు సుమా ?
కూడలసంగమదేవా || ౨౭౦ ||

226. ఉన్నత పదవినివేడను, చిన్న పదవే చాలును
దిగువనున్నవాడికేగేదెపాలిచ్చును
ఉన్నత పదవిలో నుండిన నరకమునందుండును
మీ శరణుల పాదములకనువుగానుం
చుము, మహదాని కూడలసంగమదేవా || ౨౭౨ ||

227. బ్రహ్మస్థానము వలదు
విష్ణుస్థానము వలదు
రుద్రుని స్థానము వదు
మరే స్థానమును గోరను
కూడలసంగమదేవా!
మీ సద్భక్తుల పాదముల నెరింగిన
మహాస్థానమునే కరుణించు మయ్యా ॥ ౨౨౩ ॥

228. కాకి మల విసర్జనజేయు
బంగారు కలశమ్మైయుంట కంటెను
స్వాములు మెట్టితిరుగునట్టి
అందమ్మైన పాదుకలను జేయుమయ్యా!
అయ్యా! మీ శివశరణుల పాదములకు
అందమ్మైన పాదుకలను జేయుమయ్యా
శ్లో. కర్మావలంబనంకేచిత్
కేచిత్ జ్ఞానావలంబనమ్ !
వయంతుశివభక్తానాం
పాదుకస్యావలంబనమ్ !!
కూడలసంగమదేవా!
మిమ్ము కొంగు జాచివేడెదను అదొకటే
వరమును గరుణించుమయ్యా ! ॥ ౨౨౪ ॥

229. ఏయే భావములందర్పించి ఐక్య మైతిమ
నువారి ద్వారము జూపుమయ్యా!
తనువునర్పించినవారి, మనసు నర్పించినవారి
ద్వారమును జూపుమయ్యా!
వీనినన్నింటినర్పించి జంగములు
నావారు నావారు నావారనువారి

పాదుకల క్రిందనుంచుమా నన్ను
కూడలసంగమదేవా || ౨౭౫ ||

230. నాలో భక్తి నావగింజలోనిషడ్భాగమంతలేని
నన్ను భక్తుడని యెదరు
నన్ను సదాచారియందురు
నేనేమి పాపమొనర్చితినోగదా!
పెరుగక మొదలె కోయు దురా?
చెపుమా! అయ్యా!
పోరు సల్పని వీరుడు లేనినటన సల్పినట్లు
పెద్దలందరు పెద్దగా జేసి చెప్పదురు
ఇదినాకు విధివిహితమా ?
కూడలసంగమదేవా || ౨౭౬ ||

231. ఎటుచూచినటనీవే దేవా
సమస్తవ్యాపకమైన రూపునీదేదేవా ?
''విశ్వతోచక్షువునీవే దేవా ?''
''విశ్వతోముఖమునీవేదేవా ?''
''విశ్వతో బాహువు, నీవేదేవా ?''
''విశ్వతః పాదము నీవేదేవా ?''
కూడలసంగమదేవా || ౨౭౭ ||

232. భువిని ముట్టడించినదినీమాయ అయ్యా!
నిన్నుచుట్టి నది నామనసు సుమా!
జగమేరంగినవాడవు నీవైతె నెను నీ స్వరూ
పము నెరుంగుదునయ్యా!
హస్తి అదర్శమునను న్న పగిది
నాలోనీవు లీనమైతివి
కూడలసంగమదేవా || ౨౭౮ ||

233. ఆశయను పాశమున
భవబంధితుడనైతినయ్యా!
ముమ్మాటికి మిమ్ముదల
చుటకవకాశము లేదయ్యా!
కరుణాకరఅభయకరా
వరదాని కరుణించుమయ్యా!
సంసారబంధనము దొలగించవయ్యా
కృపతో మీ శ్రీ పాదపద్మములందు
భ్రమరముగానుంచుము
భక్తజనమనోవల్లభా!
కూడలసంగమదేవా

234. చేయువాడను నేను గానయ్యా!
ఇచ్చువాడను నేను గానయ్యా!
యాచించువాడను నేను గానయ్యా!
మీయను గ్రహము గాక ఓదేవా !
ఇంటి దాసి వేసారినచో
యజమానురాలు జేసికొనునట్లు
నీకునీవు జేసికొనుము
కూడలసంగమదేవా || ౨౦౦ ||

235. దశదిశలు ధర గగనముల నేనెరుగనయ్యా
''లింగమధ్యేజగత్సర్వం''
అనునది నేనెరుగనయ్యా!
లింగసంపర్కసుఖమునందు
కూడలసంగమదేవయ్యా!
అంబుంధి లో బడినమంచుముక్కవలె
భేదభావమెరుగను
శివశివాయను చుంటిని నేను || ౨౦౦ ||

''శివంభూయాత్''

# అనుబంధపు వచనములు : -

1. ఆడిపాదములు అలసటజెందవు
చూచికనులు అలసిపోవు
పాడి నాలుక వేసర జెందదు
ఇకనేమి జెప్పను ?
మిమ్ముజేతులార పూజించి
మనసు వేసట జెందదు ? ఇకనేమి జెప్పను ?
కూడల సంగమ దేవ చిత్తగింపుము
మీ హృదయము నెరింగినేను
నడచు కొందును || ౧౧ ||

2. తాళ మేళముల సరిగమ నెరుగనైతిని
బాగుగ వాయించుట నెరుగనైతిని
అమృతగణమును దేవగణము నెరుగనైతిని
కూడల సంగమ దేవా నీకశుభము
లేని కతమున నాకు దెలిసిన పగిది
నడచు కొందును, పాడు కొందును || ౧౪ ||

3. నా శరీరమును కఱ్ఱగమార్చుమయ్యా!
నాశరీరమును సోరకాయగమార్చుమయ్యా!
నానరములను తంత్రులుగ మార్చుమయ్యా!
నా వ్రేలిని బుడుకగా మార్చుమయ్యా!
ముప్పది రెండు పాటలు బాడుమయ్యా!
ఉదరమునొత్తి వాయించుమయ్యా!
కూడల సంగమ దేవా || ౧౬ ||

4. మంచుముక్కవలె లక్కబొమ్మ వలె
తనుగరిగియను భవించు సుఖమును నేనేమని
చెప్పను ?
నే(త్రములనుండి ఆనందబాష్పములురాల
మాకూడల సంగమ దేవుని స్పర్శించితిని || ౨౦ ||

5. నెయ్యి రుచి కి కత్తి నినాకు
శ్వానము భంగినా జీవితము
సంసార సాంగత్యము వదలదు
చూడుమానాచిత్తము
ఈ శ్వానతనమును మాన్పించుము
కూడల సంగమ దేవా ఇదే మీ ధర్మము || ౨౩ ||

6. ఒక శశకమునకు (కుందేలునకు)
శ్వానములను తొమ్మిది వదలినట్లుగా
నన్ను వదలు తనను వదలుమనుట
కాయ వికారము
నన్ను వదలు తనను వదలు మనుట
మనోవికారము
కరణేం(దియములను శ్వానము ముట్టక
మొదలు, నామనసునీలో నైక్యము
గావించుమయ్యా కూడల సంగమ దేవా || ౨౪ ||

7. పసిబిడ్డను గన్న పడుపు గత్తెకు
డబ్బు ఆశకు (గిరువు) వత్తె ఇడిన
అటు పసిబిడ్డకు గాదు ఇటు విటునకుగాదు
బిడ్డనొకమారు బుజ్జగించును
విటునితోనొకపరి గూడును
డబ్బాశ వీడదు, కూడల సంగమ దేవా || ౫౦ ||

8. భృత్యునకు యజమాని ప్రసన్నుడైనచో
పదోన్నతిలభించుట తప్పదు గదా!
జేడరదాసిమయ్యకు ప్రసన్నుడైన
దేవుడు మరొకడా!
మా దారచన్నయ్యకు, డోహరకక్కయ్యకు
తెలుగు జొమ్మయ్యకు ప్రసన్నుడైనవాడు
మరో దేవుడా అయ్యా ?
నా మనసు పంచేంద్రియములు మీ వైపు
మళ్ళిన తమ వాడిగా జేసుకొనుము
కూడల సంగమ దేవా || ౫౯ ||

9. మూగవాడు గన్న స్వప్నము పగిదినా భక్తి
గుణము జెప్ప, దగదేరికిని
వినగూడదు ? నా పగతనమును బరిహరిం
చుము, కూడల సంగమ దేవా || ౬౯ ||

10. ముక్కిడి వాడు అందగత్తెను వేటాడునట్లుగా
గ్రుడ్డివాడు నవ్వుల పాలైనట్లు
మా కూడల సంగమ శరణుల ముందు
నేను భక్తుడననుట సిగ్గుచేటు || ౭౧ ||

11. పాము దినినవారిని బలుకరింపగవచ్చు
గ్రహము సోకిన వారిని బలుకరింపగ వచ్చు
ధనమదము సోకినవారిని
బలుకరింప, దగదు చూడుమా !
నిరుపేదయగు మంత్రవాదిపోగా !
ఎత్తి పొడుచి మాటలాడుదురు
కూడల సంగమ దేవా || ౭౨ ||

12. ఇటు రావయ్య ఇటు రావయ్య అని
భక్తులందరు ప్రేమ మీరతమకడకు రమ్మని
బలుకుచుండ, మరల ఇతరత్ర వెళ్ళి శరణని
మౌనముతో జేతులు జోడించివినయము
తో సేవకుడిలా మాట్లాడుతు
అతివినయము గలిగియుండిన, నిన్నుమా
కూడల సంగమ దేవుడు ప్రమథుల యెదుట
యెత్తి కొనునయ్యా || ೧೬ ||

13. భక్తుడు భక్తుని గృహమునకేతెంచిన
భృత్యుడిగా మెలుగవలెను
కర్తయ్యైకాలు గడిగించుకొనినచో
మొదటజేసిన భక్తితొలగిపోవును
లక్ష కోసుల దారినడచి
భక్తుడు భక్తుని జూచుట సదాచారము
అక్కడగూడ దాసోహమొనర్చినచో
మా కూడల సంగమ దేవుడు జేరదీయును || ೧೭ ||

14. బూరుగువృక్షము మొక్కను నాటి
అధఫలించిన లాభమేమి ?
సంపదయున్ననేమి ? శివభక్తి శూన్యమైన
చేదు బుడుమ పండిన నేమి ?
కులరహితమైన రూపము ఎక్క
డుండిననేమి ? మురికి కాలువ నీరు తేటగానుండి
ననేమి ? గుణహీనులను జూచి మెచ్చడు
మా కూడల సంగమ దేవుడు || ೬೬ ||

15. భవబంధనము భవపాశమున బడిన
కారణయేమయ్యా!
తొల్లిజన్మమున లింగార్చన మరచాను
తొల్లి జన్మమున జంగమమును
దూషించిన కతమున
సంసార దుఃఖమునెరిగిన భారమునెట్లు
సహింతును ?

16. వృక్షమునకు నోరు పేరుగా దెలసి
దిగువన నీళ్ళుబోసినచో
పైన పల్లవించును సుమా!
అట్లే లింగముఖము జంగమమని గుర్తించి
వారికి పడిపదార్థములతో
దృప్తి పరచినచో మున్ముందు సకలమగు
కోరికలను ఫలింప జేయును సుమా !
కూడల సంగమ దేవా !!



# పండిత పెద్దమఠము రాచవీరదేవర

ఎం.ఓ.ఎల్ (రిటైర్డ్) T.P.

## సంక్షిప్త పరిచయం

## నా సాహితీ యాత్ర

**ఆకాశవాణి, హైదరాబాద్.**

రికార్డింగ్ తేది 7-4-98 ఉ. 11.00గం.లకు

బ్రాడ్ కాస్ట్ తేది. 13-4-98 మం. 1.30 P.M.

| | | |
|---|---|---|
| జననం | : | స్వస్తి శ్రీ రుధిరోద్గారి నామ సంవత్సరం, 1925 |
| జన్మ స్థానం | : | జోగిపేట పెట్టమఠం, ఆందోలు, (మం.) |
| జిల్లా | : | మెదక్ జిల్లా |
| మఠము (నివాసము) | : | పెద్ద మఠము |
| మతము | : | వీర శైవ వీర మహేశ్వరులు (జంగములు) |
| తల్లి | : | శ్రీమతి నాగమాంబగారు, |
| తండ్రి | : | శ్రీ పెద్దమఠం వీరయ్య గారు |
| కారణ సంస్కారము | : | స్వస్తి శ్రీ రక్తాక్షినామ సంవత్సరం, పాల్గుణ, బహుళ, పాడ్యమి బుధవారం |
| గురువుగారు | : | షడక్షరి మహాస్వామి (గోల్లాళప్పగారు) జ్యేష్ట పితృవ్యులు |
| అభ్యాసము | : | శంకర సంస్కృత కాలేజి యాదగిరి, జిల్లా : గుల్బర్గా (కర్ణాటకము) |
| పట్ట భద్రులు | : | ''కావ్యతీర్థ'' సంస్కృతం, కలకత్తా తెలుగు ఎం.ఓ.ఎల్. |

ఉస్మానియా యూనివర్సిటీ హైద్రాబాదు, 'కన్నడ జాణ' బెంగుళూరు కన్నడ సాహిత్య పరిషత్, మద్రాసు యునివర్సిటి 'ఎన్‌ట్రన్స్', హిందీ భూషణ, హిందీ ప్రచార సభ, హైద్రాబాదు.

వృత్తి : ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖలో ఆచార్య పదవిలో (దేశికులుగా) నున్నాను.

హైద్రాబాదు ప్రభుత్వ విద్యాశాఖ నుండి తేది 18 జులై 1985న నేను రిటైర్డ్ అయినా జన్మస్థానమైన మెదక్ జిల్లా జోగిపేటకు వెళ్లి మా పెద్ద మఠము నందు స్థిర నివాసమేర్పరచుకొని వీర శైవ సమాజాభివృద్ధికై కొన్ని కార్యక్రమములను చేపట్టితిని. శ్రావణ మాసము సందర్భమున మా పెద్ద మఠములో ''జగద్గురు శ్రీ ''రేణుక విజయము'' అను పురాణ కాలక్షేపము జరుపుచుంటిని స్థానికముగా స్త్రీలు, పురుషులధిక సంఖ్యలో విచ్చేసి, శ్రవణము గావించుచుండిరి. ఇంతలోనే స్థానిక నెహ్రూ స్మారక డిగ్రీ కళాశాల నుండి అక్కడి ప్రిన్సిపాలుగారి ఆదేశానుసారముగా అక్కడే ఉపన్యాసకులైన శ్రీ లక్ష్మారెడ్డిగారు మరియు సంగారెడ్డిగారు మఠమునకు వచ్చి, ''మీరు మా కళాశాలలో తెలుగు ఉపన్యాసకులుగా ఉండుటకు మా ప్రిన్సిపాలు గారు తమనాహ్వానిస్తున్నారు కనుక రావల్సిందిగా కోరిరి. అందుకు నేను సరేయని అంగీకరించి మరుసటి దినము నుండే (ఎన్.ఎం.) కాలేజీకి ప్రతిదినము వెళ్ళి 3 పీరియడ్లచొప్పున అక్కడి విధ్యార్థులకు తెలుగును బోధించుచుంటిని ఇట్లు ఒక రెండు సంవత్సరములు గడుస్తుండగా ఇంతలోనే ఒక నిరుపేద విద్యార్థియైన వీరశైవుడు,

శ్రీ విశ్వనాథం ఎం.ఎ., వికారాబాదు గారు నా చెంతకు వచ్చి'' అయ్యగారు! నేనిప్పడు నిరుద్యోగిని నేను ఎం.ఎ., తెలుగు పరీక్షల్లో నెగ్గి 3,4 సంవత్సరములు గడిచినవి, నేను ఇక్కడి కళాశాలకు వచ్చి శ్రీ ప్రిన్సిపాలు శర్మగారిని విచారించగా వారు మీ వద్దకు వెళ్లి అర్థించుమనిరి. అందుకు మీ వద్దకు వచ్చియున్నాడను. అందుకు మీరంగీకరిస్తే మీ స్థానములో నియుక్తుడనై తెలుగు బోధిస్తానని ప్రాధేయపడెను. అందుకు నేను కూలంకషముగా నాలోచించి ''పాపము పేదవాడు, యువకుడు, ఇప్పడు నేను అంగీకరిస్తే ముందు భవిష్యత్తులో ఆ కుర్రవాడు బాగుపడతాడు, స్థిరపడిపోతాడు. నేనెంత వరకు జెప్పినను పీరియడుగానే చెప్పాల్సిందేనని ఒక నిర్ణయమునకు వచ్చి ముందాతని శ్రేయస్సును గోరి, యాతనికి అనుమతి నొసంగితిని. అతడిప్పటికిని ''మీ పుణ్యము చేతనే నొక ఉద్యోగినైనానని'' అందరితో చెప్తూ తనకృతజ్ఞతను వెలిబుచ్చుచున్నాడు.

వళ్లీ జోగిపెట నుండి హైదరాబాద్‌కు వచ్చి శ్రీ డి. ఎలమందగారు స్థాపించిన స్కూల్లో రెండు సార్లు ఉపధ్యాయుడిగా పనిజేశాను. ఇంతలో సంగారెడ్డి ''నాగార్జున జూనియర్ కాలేజీ, ప్రిన్సిపాల్ శ్రీ వీరప్పగారు వచ్చి మీరు మా కాలేజీలో సంస్కృత లెక్చరర్ (ఉపన్యాస) కులుగా పనిచేయాలని కోరడం చేత నేను సంగారెడ్డికి వెళ్లి ఒక సంవత్సరము అచటి విద్యార్థులకు సంస్కృతమును 3 పీరియళ్లు బోధించాను.'' అందుకు వారు 1650 రూపాయలు మాసిక వేతనమొసగేవారు. ఇంతలో నకస్మాత్తుగా మా రెండవ కుమారుడైన చి.పి. ప్రభులింగ దేవర ఎం.ఎ. ఎంఫిల్, పిహెచ్.డి. (28) (ఎస్.ఐ) నల్గొండ జిల్లా కోదండాపురంలో అప్పటి ముఖ్యమంత్రిగానున్న శ్రీ భాస్కర రెడ్డి గారు నీరావరి శిలాన్యాస కార్యక్రమమునకై వెళ్లగా ఎస్ఐ గా

న్నవి. ప్రభులింగదేవరను ఇంతె జాముకొరకు రావాల్సిందిగా పోలిసు పైయధికారుల నుండి సందేశము రాగా నతడక్కడికి వెళ్లి సివిల్ డ్రస్సులోనుండి అక్కడ ప్రజలు అలజడి లేపగా వారిని అదుపులో నుంచుటకై ప్రయత్నించుచుండగా ఇంతలో అనుకోకుండా ఒక పోలీసు ప్రయోగించిన తుపాకీ గుండు కాల్పునకు గురియై. యసువులు బాసెను. ఇది విని నా మనస్సు సంతాపమునకు లోనై సంగా రెడ్డిలోను "నాగార్జున కళాశాలలోని, ఉపన్యాసక" వృత్తిని గూడ వదులుకున్నాను.

ఇకపోతే 18 జూన్ 1998 లో జోగిపేటలో కొత్తగా ప్రారంభించిన ఎస్ ఆర్. ఎం. కళాశాల వారు హైదరాబాదులోని కాచిగూడలోని మా యింటికి రెండు మూడు సార్లు వచ్చి మా కాలేజిలో మీరు సంస్కృతమును బోధించాల్సిందిగా ప్రార్థించిరి. అందుకు సరే అని అంగీకరించి జోగిపేటకు వెళ్లి పాఠములను బోధిస్తూ కొద్దిమాసములు గడచేలోపుననే ఇక్కడ హైదరాబాద్ ఇంట్లో ఎవరూ లేనందున తాళము వేసినది జూచి దొంగలు ఒక రాత్రి వచ్చి తాళము పగుల గొట్టి తమకు గావల్సిన సామానులు టి.వి. టేపురికార్డు, సిల్కు చీరలు, రగ్గులు, బెడ్‌షీట్లు, ఇత్తడి, స్టీలు సామానులను దొంగిలించుకుని వెళ్లారు. (సుమారు రూ. 1,000/- విలువ వస్తువులు పోయినవి.) జోగిపేటలో నున్న నాకు మా పెద్ద కుమారుడు బసవరాజు దేవర ఫోను చేయగా వచ్చి పోలిసులకు రిపోర్టిచ్చాను. ఈ విధమైన కారణాల వలన నాకీ కాలేజీలోను స్థిరత్వ మేర్పడలేదు. ఐతే నేను ఉద్యోగము కావాలనీ యెవరీని అర్థించలేదు. తానై వచ్చిన ఉద్యోగమును చేపట్టాను. అదైనా ఈ వృద్ధాప్యములో 78 సంవత్సరముల వయస్సులో విద్యార్థులతోను మరియు తోటి యుపాధ్యాయులతోను కాలక్షేపము జరుగును కదా! యనే ఆ

వృత్తి చెపట్టానుగాని డబ్బాశతో గాదు. మరో విషయమేమనగా ''వ్యయేకృతే వర్ధతయేవనిత్యం'' అన్నట్లుగా నేర్చిన విద్యను ఇతరులకు గరుపినసె అట్టి విద్యకు ''బంగారునకు తావి అబ్బినట్ల''గునను గదా! యని నా విచారవము, కొందరికి నాయందుండే గౌరవము విద్యావితరణమునకై ఆకర్షితులై నన్నాహ్వానించారు

ఇట్లు
గ్రంథకర్త

## బిరుదులు :

''వీరశైవ సాహిత్య సార్వభౌమ'' (ఆంధ్రప్రదేశ్ వీరశైవ మహాసభ వారొసగి సన్మానించారు. ''వీరశైవ సాహిత్య భూషణ''(వీరశైవ ప్రగతి సమాజము వారు ఇచ్చారు). సంస్కృతంలో ''సాహిత్య విశారధ'' సంస్కృతం, సాహిత్య 'భూషణ జగద్గురు కంచి కామకోటి పీఠాధీ పతులు ఆశీర్వదించినవి.' 'పండితరత్న' (కాశీ జగద్గురువుల వారు) ఇచ్చారు. 'ధర్మనిరత' (రంభాపురిజగద్గురువుల వారు ఇచ్చినది) 'వీరశైవ ఆగమ సాహిత్యచతుర' 'పుంభావసరస్వతి' శ్రీశైలం పండితారాధ్యుల వారు ఆశీర్వదించారు. ''వీరశైవ ధర్మ ప్రచారక్'' జగద్గురు పంచాచార్యులు ఆశీర్వదించారు. ఇక పోతె జోగిపేట - తాండూరు. విజయవాడ, హైదరాబాదు వీరశైవ సమాజమువారు సభలో సన్మానించారు.

నియుక్తి : 15-7-1954 ఆంధ్రప్రదేశం విద్యా శాఖలో నియుక్తి

రిటైర్డ్ : 15-7-1985 రిటైర్డు

ప్రస్తుత నివాసం : ఇంటి నెం. 3-3-139 కాచిగూడా, అమృత ఆర్కేడ్ (ప్రభాత్ టాకీస్) వెనుక భాగం నెహ్రూ హైస్కూల్ వద్ద హైదరాబాద్ - 500 027

ఉద్దేశ్యం : వీర శైవ ధర్మప్రచారము, అప్పుడప్పుడు తత్ ప్రచారం, ఆకాశవాణి, దూరదర్శన్ ల ద్వారా ప్రసంగించుట.
ఆంధ్ర పత్రికలలో లేఖలు వ్రాయుట.

**అముద్రిత గ్రంథములు :**

1. శివాను భవ సంపుటి (భాగము - 12)
2. వీరశైవ గత వైభవము
3. విరాగి - నవల (అతి చిన్నది)
4. దారిద్ర్యపు పెనుభూతం (నాటకం)
5. ఆదర్శపు వివాహం (నాటకం) అథవా, వర్ణాంతర వివాహము
6. జగద్గురు శ్రీ రేణుకాచార్యులు (నాటిక)
7. జగజ్యోతి బసవేశ్వర్యుని వచనములు
8. అద్భుతప్రేమ అందని లేమ (కథానిక)
9. వీరశైవ ధార్మిక వ్యాససంపుటి
10. శతకత్రయ సారం (కన్నడకు తెలుగు సేత)



ఓం

# ముద్రిత గ్రంథములు

## ఆంధ్ర ప్రదేశ్ వీర శైవ ధర్మగ్రంథమాల

హైదరాబాద్ - 500 027 (ఆం. ప్ర.)

అమృత అపార్టుమెంటు (ప్రభాత్ టాకీసు) వెనుక భాగములోని

గదుల సంఖ్య 10 మరియు 11 గలవి.

వీరశైవ సాహిత్య భాండారు

## గ్రంథముల సూచి ప్రకటన

1. వీరశైవ ధర్మ భావ గీతికలు
   (నూతన ఫక్కీలో తెలుగు లో నున్నవి.
   కన్నడ, హిందీ-సంస్కృతములో గేయాలున్నవి) 15-00
2. శ్రీ బసవేశ్వర తత్త్వములు
   (సంపాదకీయ వ్యాసములు) 15-00
3. వీరశైవ ధర్మాన్వేషణము (కన్నడకు దెనుగు సేత) 10-00
4. నేనెవరు ?
   (వీరశైవ సమాజోద్యమము, జి. మెదక్) 15-00
   గ్రంథకర్త జీవిత చరిత్ర 1 వ భాగము 2 వ భా. 25-35
5. రత్న త్రయము (నీతి బోధక వ్యాసాలు) 20-00
6. మహాజ్ఞాని చెన్నబసవన్న (కన్నడకు దెనుగు సేత) 10-50
7. అల్లమ ప్రభువిజయము (నాటిక) 15-00
8. వీరవిరాగిణి అక్కమహాదేవి (నాటిక) 15-00
9. ప్రతిజ్ఞా పూర్తి (నాటిక) 15-00
10. షష్టిపూర్తి విశేష సంచిక, ఇందులో పై నాటికలు
    మరియు శ్రీ బసవేశ్వర కన్నడ వచనములకు

దెనుగు సేత మరియు
సూక్తి సుధా సంస్కృత శ్లోకములకు
దెనుగు సేత 15-00

11. ఇష్ట లింగార్చనా విధి (సంక్షిప్తము మరియు విశేషోపచారములతో నున్నది) 6-00
12. జగద్గురు శ్రీ రేణుకాచార్యులవారి జయంత్యుత్సవ సందర్భమున శ్రీ స్వామి వీరభద్ర శివాచార్య హాలుగూరుగారి ఉపన్యాసమునకు దెనుగు సేత 2-00
13. జగద్గురు శ్రీ రేణుకాచార్యులవారి చరితామృతము (ఇది వచన కావ్యము) 20-00
14. ప్రాచీన వీరశైవము (దీనిని వీరశైవులందరు తప్పకుండ జదువ వలసినది. వీరశైవ ధర్మము యొక్క పుట్టుక దాని యభివృద్ధి గలదు). 20-00
15. వీరశైవులాచరించదగిన నియమావళి సూచనల పట్టిక 5-50
16. వీరశైవుల గోత్ర సూత్ర పటము 5-00
17. జగద్గురు పంచాచార్యుల సంక్షిప్త పరిచయము 12-00
18. స్వయం పురోహితము (తెలుగు) ఇందు శిశు జననము నుండి వివాహాది మరణానంతరము సశాస్త్రముగా సమాధి క్రియ. జ్యోతిష ముహూర్తములు షోడశ సంస్కారములున్నవి. 50-00
19. గ్రంథకర్త జీవిత చరిత్ర 2వ భాగము 30-00
20. గ్రంథకర్త జీవిత చరిత్ర 3వ భాగము 30-00
21. ఆంధ్ర ప్రదేశ్ వీరమహేశ్వర (జంగము)

| | | |
|---|---|---|
| | మహాసభయొక్క నియమావళి (బైలాసు) | 5-00 |
| 22. | వీరశైవ పురోహితుల హక్కు బాపతుల పట్టిక | 5-00 |
| 23. | బసవపురాణము పద్యకావ్యము (పిడుపర్తి సోమనాధకవి విరచితము) | 100-00 |
| 24. | ఉమామహేశ్వర వ్రతకల్పము | 10-00 |
| 25. | ఆకాశవాణి, దూరదర్శన్ లోని ప్రసంగాలు (1 వ భాగం, 2 వ భాగం) | 50-00 |
| 26. | శివగీత సవ్యాఖ్య | 30-00 |
| 27. | బసవసూక్తి సుధా | 20-00 |

**ఇవే గాకుండ :** జగద్గురు శ్రీ రేణుకాది పంచాచార్యుల మరియు శ్రీ బసవేశ్వరులవారి పటములు, శ్రేష్ఠమైన విభూతుండలు, లింగములు, శివసూత్రములు (శివధారములు) మొదలగునవి ఇక్కడ దొరకును. కావున వీరశైవులందరు అభిమానముతో పైన గనబరచిన చిరునామాకు (అడ్రసుకు) వ్రాసిగాని అథవా స్వయముగా వచ్చిగాని ఉచితవెలను చెల్లించి మీకు కావలసినవి పొందగలరు.

ఇట్లు

సంపాదకులు

నిర్వాహకులు, ప్రధానాచార్యులు,

**వే. పం. పెద్దమఠము రాచవీర దేవర,** M.O.L.

ఇం.నెం. 3-3-139, కాచిగూడ, నెహ్రూ హైస్కూలు వద్ద,

హైదరాబాదు - 27.